భారతీనికేతన గ్రంథమాల:— ప్రథమ కుసుమము.

# వైదర్భీ విలాసము.

(ఆఱంకముల నాటకము.)

ఇది

మహాభారతసార గ్రంథకర్తయగు

## ద్రోణంరాజు సీతారామారావుచే

రచియింపఁబడి





కాకినాడ:

స్కేవు అండు కో ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

గ్రంథకర్తచేఁ బ్రచురింపఁబడియె.

 [వెల 0—12—0.



ద్రోణంరాజు సీతారామారావు.

# పీఠిక.

ఇంతకుమున్ను నేననేక నాటకంబుల రచించియుంటినిగాని యవి యన్నియును బ్రచురపఱచు హక్కు నితరుల కిచ్చివేసియుంటిని. ఇందుకుఁ గారణము ధనలోపమే. ఇట్లుండ నేవియైన చక్కని గ్రంథముల రచించి స్వయముగా నచ్చువేయించు భాగ్యము నాకుఁ గలుగునాయని యాలోచించి యెట్లైన ముందొక చక్కనినాటకము ప్రచురింపఁదలంచి యీ వైదర్భీవిలాసము రచించితిని. ఈ పురంబునందే సదయహృదయులగు నొక వైశ్యకులాగ్రణి నాతో గొన్ని యొడంబడికలు జేసికొని నేనువ్రాసిన గ్రంథములకు నగు ముద్రణవ్యయము తాను భరించెదనని చెప్పి ముందీనాటకమునకు సహాయమొనర్చుటచేఁ బ్రచురింపగల్గితిని. కరుణార్ద్ర హృదయులగు వారినిఁ బరమేశ్వరుం డాచంద్రార్కతారావనీశరధిస్థాయిగ రక్షించుగాక. "భారతీనికేతన" మనుపేర నొక గ్రంథమాల స్థాపించి యీనాటక మాగ్రంథమాలకుఁ బ్రథమకుసుమముగా మీకు సమర్పించితిని. భాగవతంబుననున్న రుక్మిణీకల్యాణకథ మాతృకగా దీసికొనియచ్చటచ్చట మూలకథకు భంగముఁగాకుండరచియించితిని. భగవంతుండైన వాసుదేవుని చరిత్ర మగుటచేతనైనను, లేక నాయందుఁగల వాత్సల్యముచేతనైనను నార్యులు దీనినాదరింతురని నమ్ముచున్నాను. దోషంబులకేమి! కాళిదాసాదికవు లంతటివారికైనను నొకప్పుడుఁ గలుగుచుండును. అట్టియెడల నల్పజ్ఞాన వయస్కుఁడనగు నాగ్రంథమునం దుండుట యదియొక వింతగాదు. కావున నట్టిదోషంబులు నాయందు దయాంతరంగులై దెలిపినచోఁ బునర్ముద్రణమందు సవరించుకొందును.

ఇట్లు,
విద్వజ్జన విధేయుఁడు,
ద్రోణంరాజు సీతారామారావు.

కాకినాడ,
10-8-16.

## ఈ నాటకమునందు వచ్చుపాత్రలు.

భీష్మకుఁడు — విదర్భాపురాధిపతి.

విశారదుఁడు — మంత్రి.

రుక్మి — భీష్మకుని జ్యేష్ఠసుతుఁడు.

మణికంధరుఁడు — దేవదూత.

శిశుపాలుఁడు — చేదిపురాధీశ్వరుఁడు — రుక్మిణినిఁ బెండ్లియాడఁదలంచినవాఁడు.

జరాసంధుఁడు — మగధనాథుఁడు.<br>
దంతవక్త్రుఁడు —<br>
సాల్వుఁడు — } శిశుపాల పక్షపాతులు.

కాలయవనుఁడు — శ్రీకృష్ణునిచే హతుండైనవాఁడు.

ముచికుందుఁడు — విష్ణుభక్తుఁడు.

శ్రీకృష్ణుఁడు — ద్వారకాపురాధీశ్వరుఁడు.

బలరాముఁడు — శ్రీకృష్ణుని యగ్రజుఁడు.

సాత్యకి — శ్రీకృష్ణుని తమ్ముఁడు

కంచుకి ,, మందిరపాలకుఁడు.

సునందుఁడు — శ్రీకృష్ణుని వేడుకచెలికాఁడు.

దారుకుఁడు — ,, రథసారథి.

విష్ణుశర్మ — విదర్భపుర బ్రాహ్మణుఁడు.

అగ్నిద్యోతనుఁడు — రుక్మిణిసందేశంబు కృష్ణున కెఱింగింపవచ్చిన భూసురుఁడు.

నారదుఁడు — బ్రహ్మఋషి.

### స్త్రీలు.

రుక్మిణి — భీష్మకుని పుత్రిక.

భారతి —<br>
విమల — } చెలికత్తెలు.



# అంకితము



సీ॥ శ్రీరమేశపద పం ♦ కేరుహంబుల నెప్డు భజియించుచుండెడి ♦ వాడవగుట
ధర్మమే జయమను ♦ తాత్పర్యమును బూని వర్తింపుచుండిన ♦ వాడవగుట
నీ తాతతండ్రుల ♦ నిర్మలకీర్తిని బ్రాకింపుచుండిన ♦ వాడవగుట
సత్కవీశ్వరుడవై ♦ సద్యశంబందుచు వరకవీంద్రుల బ్రోచు ♦ వాడవగుట

తే॥ గీ॥ మామక కనుకావ్యకన్యక ♦ మహిని నిన్ను
భర్తగా వరియించెను ♦ భాసురముగ
నప్పరాడ్వంశమహిత దు ♦ గ్ధాబ్ధిచంద్ర
యమలగుణధేయ వేంకటా ♦ ద్ర్యప్పరాయ.

సీ॥ సకల భాషావిశే ♦ ష రహస్య నిక్షేప కుక్షియై యలరెడు ♦ కోమలాంగి
వేశ్యచే జూపబడక ♦ ప్పిన యరుంధతిరీతి వర్తింపుచుండిన ♦ పద్మగంధి
క్షితినాథచంద్రుల ♦ స్తుతిగాంచి యశముతో వర్ధిల్లుచుండిన ♦ వారిజాక్షి
గర్వమింతయులేక ♦ కవులకెల్లను విధేయతజూపి యొప్పెడు ♦ యతివమిన్న

తే॥ గీ॥ అట్టి మామక కావ్యక ♦ న్యాఘాటి
తగినవాడవు నీవంచు ♦ దలచి నీకు
పజ్జజేరెను గరుణ జే ♦ బట్టుమింక
రాజమార్తాండ వేంకటా ♦ ద్ర్యప్పరాయ.

సీ॥ శ్రీనాథపద సర ♦ సీరుహంబుల కంత రంగంబు కమలా ♦ కరంబుగాగ
నీమూర్తివంతంబు ♦ నిఖిల కవిహృదయ భవనంబులకు బ్రదీ ♦ పంబుగాగ
దివ్యమగా నీకృప ♦ దీనజనుల దరిద్ర్యము వాప మందార ♦ తరువుగాగ
నీ దానధర్మముల్ ♦ నీసద్గుణంబులు క్ష్మాపతులకు సంత ♦ సంబుగాగ

తే॥ గీ॥ ధరణి బాలింపు మాచంద్ర ♦ తారకముగ
దశదిశలయందు నీఘన ♦ యశము నిండ
నప్పరాడ్వంశమహిత దు ♦ గ్ధాబ్ధిచంద్ర
ధీరగుణసాంద్ర వేంకటా ♦ ద్రిక్షితీంద్ర.

ఇట్లు:—భవదాశ్రితుడు,
ద్రోణంరాజు సీతారామారావు.

# తప్పొప్పులు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 7 | ఘాడలేని. | బాడలేని. |
| | 8 | సఖముయగును. | సఖముయగును. |
| 53 | 22 | సురానీకంబు. | ససురానీకంబు. |
| 56 | సీ\|\| | యమరకున్నదె మెక్క. | యమరకున్నదెయెక్క |
| 69 | 16 | విబుధేంద్రవంద్య. | రమణీయమూర్తి. |
| 71 | ఉ\|\| (రెండవపాదములో) | పరియించిన రుక్మిణీ. | పరియించినయట్టి రుక్మిణీ |
| 75 | (రెండవ సీ\|\| పద్యములో మూడవపాదములో) | సలకంస దైత్యమా ♦ రణము సాక్షి. | కంసదానవనాథ ♦ హింససాక్షి. |
| 82 | 3 | అవ్వారికే. | అన్యానికే. |

(ఇంకను నచ్చటచ్చట గద్యయందు పొరబాట్లుండిన దయచూని సవరించుకొనవలెను.)





శ్రీమత్పరదేవతాయైనమః

# వైదర్భీవిలాసము.

నాంది.

మ॥ యదువంశంబునఁబుట్టి శైశవమునం ♦ దానందు మందన్ యశో
ద దయంజూచి వినోదలీలలను మో ♦ దంబందఁగాఁజేసి దు
ర్మద కంసాదులఁద్రుంచి యాదవుల స ♦ న్మానింపుచున్ రుక్మిణీ
మదిరాక్షిం గొనినట్టి శ్రీహరి మిముం ♦ బాలించి రక్షించుతన్.

(నాంద్యంతమున.)

సూత్రధారుఁడు—[ప్రవేశించి] అతివిస్తరమెందుకు! పారిపార్శ్వకా! నీవొకసారి యిటురమ్ము.

పారి—[ప్రవేశించి] ఆర్యా! ఏమిసెలవు!

సూత్ర—ఇంకను నేమిసెలవని యడుగుచుంటివా!

తే॥ గీ॥ ద్యుమణి నీక్షింపవేచు చ ♦ క్రములరీతి
మన ప్రదర్శకమీక్షింప ♦ మహిత జనులు
కాంక్షమై వేచియున్నారు ♦ కాంచుమదిగో
వీరి రంజింపఁజేయుట ♦ వేడ్కకాదె.

పారి—అట్లయిన మనకు సంతోషమే. కాని వీరినిప్పు డేప్రదర్శకంబున రంజింపఁజేయఁదలంచిరో నే నెఱుంగవచ్చునా!

సూత్ర—మిత్రమా! నీవెఱుంగనిదే యేకార్యమయినను సాగునా! ఈసభ్యులు నన్నాఁబిలచి,

సీ॥ ఎవ్వానిచరిత క ♦ ర్ణేంద్రియంబులసోక
నఖిల కల్యాణంబు ♦ లలరుచుండు

ఎవ్వానిపదసేవ ♦ లేశాద్రిద్దు గావింపఁ
బాప జాలంబులు ♦ భస్మమగును
ఎవ్వానిచర్యల ♦ నెవ్వియైననువిన్న
సంతాపములువోయి ♦ శాంతికలుగు
ఎవ్వాని సన్మూర్తి ♦ నీక్షింపఁగల్గిన
సమిత తత్వజ్ఞాన ♦ మందనగును
తే॥ గీ॥ నెవఁడు ధరణి భారమువాప ♦ భువిని యాద
వాన్వయంబున జన్మించె ♦ నట్టి కృష్ణు
చరితమునునాడి మాకును ♦ సంతసంబు
వెల్లిగొల్పుము తప్పక ♦ యుల్లములను.

అని యాజ్ఞాపించిరి. అందుచే నేపద్రిదర్శనంబున వీరికి ముదంబు గూర్పుదు నాయని సంశయముకలిగి నీతో నాలోచించుటకు రావించితిని.

పారి—నాటకప్రదర్శనాకుశలురగు మీకంటె నాకుమాత్రి మెక్కునతెలియునా! అయినను దీనింగూర్చి మీరింతగా నాలోచింపనక్కరలేదు. మీరు నాంది యందే సూచించిరికదా.

సూత్రి—అవును. జ్ఞప్తికివచ్చినది. రుక్మిణీవివాహకథ మిగుల రమ్యముగనే యుండును. ఇటీవల నూతనముగా నాకథను "వైదర్భీవిలాస" మను పేర నొక కవి నాటకముగా రచియించినాఁడు. అత్యాది పరమపావనమైన చరిత్రమై యొప్పుటయేగాక ప్రదర్శనయోగ్యమై యున్నది.

పారి—ఆ నాటకకర్త నామంబు వినవచ్చునా.

సూత్రి—అతఁడు మనకుఁ జిరపరిచితుండే.

సీ॥ రాజగోపాలభూ ♦ రమణాగ్రగణ్యుని
భవ్యకారుణ్యంబు ♦ బడసినాఁడు
తిరువ్రూరు నృపతికి ♦ దివ్యవాగ్ధార జూ
పించి బిరుదమొందు ♦ గాంచినాఁడు

యంకిసీక్ష్మాపతి • యాదరింపఁగ
నెంతయైన యశంబంది • యలరినాఁడు
సత్యవోల్వంశాబ్ధి • చంద్రిల సంస్థాన
మందునఁ గొన్నినా • ళ్ళలరినాఁడు

తే॥ గీ॥ కోటగిరివంశ వారాసి • కువలయేశు
చేత బంగారు బిరుదంబు • జెందినాఁడు
అతఁడు ద్రోణమరాజ వం • శాబ్ధిచంద్రుఁ
డమలగుణుఁడు సీతారామ • యాహ్వయుండు.

చ॥ తిరుపతి వేంకటేశ్వర సు • ధీశులఁ గొల్చి నిరర్గళాద్భుతా
కరరసపుంజమంజులవి • కస్వరచారుకథాసుధాదురం
ధరబహుళప్రబంధకవి • తావనితామహితోక్తిసంపదన్
ధరణిని ఖ్యాతిఁ జెందుకవి • తల్లజుఁడీతఁడుగాడె యెన్నఁగన్.

పారి—అవును. ఈతఁ డిదివరకే యనేక నాటకంబులు రచియించి యశంబునందు చున్నవాఁడే.

సూత్రి—ఈతఁ డీనాటకమును రచియించి,

సీ॥ జనకుఁడౌ శ్రీరంగ • మనుజవల్లభు సుకీర్తి
రమకువన్నెను • దెచ్చెనెవఁడు
సిరతంబు దానంబు • నెలకొల్పి ముదమున
నర్థులఁ బాలించి • యలరునెవఁడు
కవులఁ బోషించుటెగాక • కవియాచు గ్రంథముల్
భవ్యశైలినివ్రాసి • బరగునెవఁడు
శాంతమే తనకు భూ • షణమంచుఁ దలపోసి
ప్రజలఁ బాలింపుచుఁ • బ్రబలునెవఁడు

తే॥ గీ॥ అట్టి శ్రీయప్పరాయ వం ♦ శాబ్ధిచంద్రుఁ
డగుచు నొప్పిన వేంకటా ♦ ద్ర్యప్పరాయ
రాజమౌళికి నీగ్రంథ ♦ రాజ మంకి
తంబు గూర్చెను మిగుల మో ♦ దంబు గూడ.

పారి—అహా! కథఁజూడగా శ్రీమన్నారాయణస్వరూపుఁడగు కృష్ణుని పెండ్లికథయై యున్నది. గ్రంథకర్త విషయమూ యందఱును దెలిసినదే. కృతికర్త యీ రాజేంద్రుండగుటయే గాక కవియై శ్రీ శోభనాద్రి విజయాది గ్రంథంబుల రచించి, కవులపాలిటికిఁ గల్పభూరుహంబై తన యశోలతను సమస్తదిక్కుల బ్రాకింపుచున్నవాఁడే. కావున మనమింక దేనికిని సంశయింపఁబనిలేదు.

సూత్రి—మిత్రమా! ఈసభ్యులు,

తే॥ గీ॥ దూరముననున్న భర్తకుఁ ♦ దోయజాక్షి
వేచియుండెడి రీతిని ♦ వీరలిప్పు
డెపుడు తెరలేచు పాత్రంబు ♦ లెపుడువచ్చు
ననుచు నిండుమోదంబున ♦ నలరుచుండ్రి.

ఇంక నీసభ్యులు కాలహరణమునకు సైపరు. కావున ప్రదర్శనము ప్రారంభింతము. వీరితో నొక చిన్నమనవి చేసికొనవలసియున్నది. (సభవంకఁజూచి) పూజ్యులగు నో సభాస్తారులారా!

సీ॥ అలరుక్మి రుక్మిణీ ♦ లలనను హరికి న
ర్పించ వలదంచు బో ♦ ధించునుడులు
వైదర్భి యుద్యాన ♦ వనమందు నుండంగ
చైద్యుండు చెనటియై ♦ సలుపుమాయ
సాల్వ జరాసంధ ♦ చైద్యులు శ్రీకృష్ణు
మరణమ్మునకుఁబన్ను ♦ మాయతంత్ర
మాకాల యవనుని ♦ నాజిలోఁ గృష్ణుండు
మడియగా జేసిన ♦ మహితచిత్ర

# ప్రథమాంకము.

తే॥ గీ॥ మనవి దేవుఁడు రుక్మిణీ ♦ యువతిఁ బంప
హరినిఁ జూడంగ నరుగుట; ♦ నతఁడు వచ్చి
భోజ కన్యామణిని గొని ♦ పోవుటయును
గాంచి యానందమందంగఁ ♦ గలరు మీరు.

(తెరలో)

ఓరోరీ! పాపీ! శైలూషాధమా! అమంగళపాఠకా! ఎవఁడవురా! నీవు.

మ॥ సకలక్ష్మాధవ మానినీజన విరా ♦ జత్ఫాల సింధూరసాం
ద్రకళాలంకరుణారుణాంఘ్రికమల ♦ ద్వంద్వంబు చేకొన్న భీ
ష్మకకన్యామణి రుక్మిణీరమణినిన్ ♦ జైద్యుండు గల్గంగ గొం
కకఁ గృష్ణుం డెటు గొంచుపోఁగలుగు నీ ♦ క్ష్మాచక్రి మల్లాడదే.

సూత్ర— పారిపార్శ్వకా! రుక్మిణీదేవిని గృష్ణుఁడు గొనిపోవుననుమాట శిశుపాలపక్షపాతియగు రుక్మి యాలించి రోషకషాయితాత్ముఁడై దండతాడిత మహోరగంబు కరణి మండిపడుచు నిట్లు వచ్చుచున్నాఁడు. ఇంక మన మిచ్చోట నుండరాదు. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)—ఇది ప్రస్తావన:—





# వైదర్భీవిలాసము.

## ప్రథమాంకము.

[ఖడ్గధరుఁడై రుక్మి—ప్రవేశించి ]

రుక్మి—అరే! పాపీ! శైలూషాధమా ! అమంగళపాఠకా ! ఎవ్వఁడవురా ! నీవు !

మ॥ సకలక్ష్మాధవ............(అను పద్యమునుఁ జదువుచున్నాఁడు.)

నా చెల్లెలగు రుక్మిణీకన్యను నెల్లుండను శిశుపాలున కర్పించి మోదంబునందనుండగా దానికి వ్యతిరేకముగా కృష్ణుండు రుక్మిణిని గొనిపోవునని యమంగళంబుల నెవ్వఁడో పలుకుచున్నాఁడు. అసురాత్ముం డెచ్చటను గనుపింపఁడేమి ! (ప్రకాశముగా) ఓరీ నీచాత్మా !

తే॥ గీ॥ పొలతి రుక్మిణిఁ హరికొని ♦ పోవునంచు
బలికిననుఁజూచి భీతిని ♦ బాఱిపోతె
ధైర్యమేరమ్ము యెదుటకు ♦ దప్పకిపుడు
కంఠమును దఱుగుదునాదు ♦ ఖడ్గమునను.

(ఇటునటు జూచి) ఏమిదీ ! ఎవ్వఁడును గానిపింపఁడే. ఎవ్వఁడును లేకున్నచో నీవాక్యంబులు నాచెవి నేలఁబడెను. నాభ్రాంతియే యిట్లు చేసెనేమో. కానిమ్ము. ఏమైననా కేమి ! హరిహర హిరణ్యగర్భులడ్డమైనను వెనుదీయక నాసోదరిని శిశుపాలున కొసంగితీరెదను. (ఇంచుక యూరకుండి) తండ్రిగారు కొలువుదీర్చు వేళయైనది. నే నచ్చటకేగి వివాహప్రశంస యేమివచ్చునో చూచెదఁగాక.

(నిష్క్రమించును.)

రంగము:—[కుండినపురంబున సభాభవనంబున భీష్మకుఁడును—మంత్రియగు విశారదుండును ప్రవేశించుచున్నారు.]

భీష్మ—మంత్రీ! విశారదా! ఆడపిల్లలను గాంచినవారిజన్మ బహుకష్టమైనదికదా.

విశా—దేవా! అట్లు సెలవిచ్చెదరేల!

భీష్మ—మఱేమియునులేదు. పిల్లల వివాహవిషయమై యెంతకష్టమయినను బడవలసి వచ్చును. మనము తెచ్చినవరుఁడు కన్యకకుఁ బనికిరాఁడు. ఆమె వరించిన వరుఁడు మనకుఁ బనికిరాఁడు. ధనముగల్గినవానికి విద్యయుండదు. ధనమును విద్యయున్నవాఁడు పరాక్రమహీనుండై యుండును. ఈ మూఁడునుగల్గినవానికి సౌందర్యము కొఱంతయై యుండును. ఇవి యన్నియుఁ గలిగిన వరుని దెచ్చుట మిక్కిలి కష్టతరముకదా!

విశా—దేవర సూచించినది సత్యమే. ఒక టొనఁగూడిన నొక టొనఁగూడదు. అయినను మీకిప్పుడిట్టి విచార మేల కలుగవలెను.

భీష్మ—సచివాగ్రణీ! తెలిసియుండియు నడిగెదవేల.

తే॥ గీ॥ పరిణయముసేయఁ బ్రాయంబు ♦ వచ్చెఁగాదె
సుగుణములదొంతి రుక్మిణీ ♦ సుదతికిపుడు
యింక సేయకయున్న న ♦ రేంద్రులెల్ల
బరిహాసింపరె నన్ను భా ♦ వంబులందు.

విశా—దానికై యింతగా యోచింపనేల!

తే॥ గీ॥ పుడమి భారముఁబాపఁగాఁ ♦ బుట్టినాఁడు
భక్తజనములఁ గాపాడి ♦ వరలువాఁడు
కన్నె రుక్మిణీ హృదయంబు ♦ గొన్నవాఁడు
లేఁడె మనలకు గొల్లల ♦ కోడెగాఁడు.

అనందనందనుండైన శ్రీకృష్ణునకుఁ గన్యకనీయ నిదివరకే నిశ్చయించిరిగదా!

భీష్మ—అప్రసంగతినిఁగూర్చి నే నేమని చెప్పుదును.

చ॥ నిలచినఁ గూరుచున్నశయ ♦ నించిన మేల్కనినన్ సఖాళితోఁ
గలసి చరింపుచుండిన నొ ♦ కర్తయె యుండిన నెద్దియేనియున్

సలుపుచునున్న మానినను ♦ జక్కదనంబుల కిక్కరుక్మిణీ
లలన మనంబునందునఁ ద ♦ లంపుచునుండును గృష్ణ నామమున్.

సీ॥ మాధవు పాదముల్ ♦ మదియందు నిల్పుటే
పరమతత్వంబైన ♦ పాటవంబు
జలజాక్షు సత్కృప ♦ కలుగు టెప్పు డటంచు
సంతోషమందుటే ♦ సద్వ్రతంబు
వాసుదేవునకెప్డు ♦ బరిచర్య సేయుటే
దేవతారాధన ♦ దివ్యఫలము
శ్రీకృష్ణు కరుణచేఁ ♦ జెల్వొంది యుండుటే
ప్రాప్తమైనట్టి సా ♦ మ్రాజ్యపదవి
తే॥ గీ॥ యనుచుఁ జెలులతో బల్కుచు ♦ నాత్మయందు
సంతతము గృష్ణు ఘనపాద ♦ జలజములను
నిల్పి యలరారుచున్నది ♦ నిశ్చయముగ
నేమిచెప్పుదు నాపుత్రి ♦ యెపుడు సచివ.

విశా — దేవా! మీయెదుట సాహసించి చెప్పువాడను గాను. అయినను నీవిషయంబునఁ జెప్పవలసివచ్చినది. కావున మన్నింపుఁడు. దేవరవారి తనూజారత్నమైన రుక్మిణి బాల్యంబాదిగ వాసుదేవునియందుఁ దన హృదయంబు హత్తించియున్నది. కావున నతని కొసంగుటయే మంచిది. మఱియు నానందనందనుండు సుగుణసంపదయందుఁగాని, బలపరాక్రమశౌర్య ధైర్యసాహసంబులయందుఁగాని తక్కిన రాజన్యలోకంబున కొక్కఁడయుఁ దీసిపోఁడు. మునులచేతను దేవతలచేతను సాక్షాద్విష్ణుస్వరూపుఁడుగా భావింపఁబడుచున్న యమ్మహాత్మునకుఁ గన్నియ నొసంగి వివాహము సేయుట మీ భాగ్యంబని తలంపుఁడు.

భీష్మ — సచివా! నాయభిప్రాయమును నట్లేయున్నది. కాని యందుల కస్మత్తనూభవుం డంగీకరింపక యున్నవాఁడు.

తే॥ గీ॥ ఎట్లయిన శిశుపాలున ♦ కిచ్చి పెండ్లి
సేతు నంచును నున్నాఁడు ♦ చెనటి సుతుఁడు

వాని మతమెట్లు ద్రిప్పంగ ♦ వశము మనకు
దైవవిధి యెట్టులున్నదో ♦ తలఁపఁజాల.

మం—దేవా! మీరిందు నిశ్చయాభిప్రాయము బూనియున్నవారేని యువరాజాగా రేమిసేయఁగలరు.

భీష్మ—సచివా! అట్లనరాదు. ఏలయన,

తే॥ గీ॥ భువనములు మూఁడు నేకమై ♦ పోరుగాక
దర్పము నడంచి; రుక్మిణీ ♦ తరుణినిచ్చి
పరిణయము సేతు నని శిశు ♦ పాలుతోడ
బ్రతిన వహియించి యుండెనా ♦ వరసుతుండు.

అంతియే గాక

మ॥ ధరణీపాల కులావతంసులు సము ♦ ద్యద్బాహు దుర్వార దు
స్తర దర్పోన్నతులుల్; భయంకరులునౌ ♦ సాల్వాది భూపాలకుల్
వర చేదీశుని పక్షమూనిసుత ను ♦ ద్వాహంబు గావింప కు
న్న; రణక్షోణికి నన్ను దింపుటకునుల్ ♦ భావింపరే మిత్రమా.

అందులాగూర్చి నా డెందంబున మిగుల సందియముగలుగుచున్నది.

మం—దేవా! ఇదియా మీకుఁ గలిగినసందియము. నిశ్చయముగా మీరు రుక్మిణీ కన్యను గృష్ణున కొసంగితిరేని వీరెవ్వరును నడ్డుపడశక్తులుకారు.

భీష్మ—కానిమ్ము. దైవసంఘటన యెట్లున్నదో! ఇప్పుడే కుమారుఁడు రాఁగలఁడుకదా. వానితోఁగూడఁ దగువిధంబున యోచించెదను.

(తెరలో)

ఉ॥ సందియమందబోకు బల ♦ శాసనవైభవ చేదిభూప నీ
డెందమునందు నింకను; గ ♦ డింది శ్రమంబును బొందియైనఁ బూ
ర్ణేందునిభాస్య రుక్మిణిని ♦ నిచ్చి వివాహము జేసినీకు నా
నందము గూర్తు సత్యముగ ♦ నందఱుమెచ్చఁగ భూతలమ్మునన్.

భీష్మ—(ఆలోచించి) మంత్రీ! ఈపలుకులు వింటివా! శిశుపాలుఁ డిచ్చటికి వచ్చియుండెనేమో. కానున్నచో రుక్మి యిట్లు వచించుట కేమియవసరంబున్నది. (ఎదుటఁజూచి) అదుగో! కుమారుండిట్లు వచ్చుచున్నాఁడు.

(రుక్మి ప్రవేశించును.)

రుక్మి—తండ్రీ! నమస్కారములు.

భీష్మ—కుమారా! ఇటఁ గూర్చుండుము.

(రుక్మి ఆసీనుఁడగును)

రుక్మి—(భీష్మకునిఁజూచి) తండ్రీ! నీవేదియో యాలోచించుచున్నట్లున్నావే.

భీష్మ—కుమారా! నీకుఁ దెలియని యాలోచన యేమున్నది.

తే॥ గీ॥ వాసుదేవుని బతిగ భా ♦ వమునఁగోరి
యతని చింతన చేతను ♦ నలరుచున్న
మనదు రుక్మిణీ కన్యను ♦ మాధవునకు
బెండ్లి యొనరించుటొప్పదే ♦ పృథ్వియందు.

రుక్మి—(కోపమున) యేమీ! తండ్రీ! యిట్లు పలుకుచుంటివి. కృష్ణునకా! రుక్మిణి నొసంగఁ దలంపుచుంటివి. సుక్షత్రియవంశ పారిజాతులమగు మనమెడ! పేదగొల్లడైన కృష్ణుడెడ! మన రుక్మిణిని గొనుటయెడ! చాలుఁ జాలు. ఇట్టి పలుకు లెవ్వరైనను విన్నచో నవ్విపోవుదురు. [illegible] [illegible] బోధించిరా?

భీష్మ—కుమారా! ఆగ్రహింపకుము. శ్రీకృష్ణుని మహిమను బహుమహాత్ములు భగవత్స్వరూపునిగా నెంచుచున్నారు. అదియుంగాక మన రుక్మిణీహృదయంబు బాల్యంబునుండియు వానియందుఁ జిక్కియున్నది. అట్టిచో నయ్యది యనుకూల దాంపత్యమై విరాజిల్లును. కాంతచిత్త మెవ్వనియందు లగ్నమై యుండునో, వానిందెచ్చి పరిణయంబుసేయుట తల్లిదండ్రులకు శ్రేయస్కరము. అట్లు కాదేని యా దాంపత్య మభివృద్ధిబొందనేరదు.

రుక్మి—నోరెఱుంగని పసికూనయగు రుక్మిణికి గలహప్రియుండైన యా నారదుండు గోరంతలు కొండంతలుగాఁజేసి, యాకృష్ణునింగూర్చి విశేషంబుగ వర్ణించి చెప్పంగనే యామె యాతనిపై మనంబు నిల్పియున్నదిగాని యామె నిజంబు

నాకసియుండలేదు. నిజం బరసెనేని తన చిత్తంబును మరల్చుకొనును. నిజముగా మీరు కన్యక్షేమంబు విచారించి పలుకుచుండుటలేదు. పిల్ల యొక్క సౌఖ్యము నేనుమాత్రము విచారించువాఁడను గానా!

భీష్మ — వత్సా! పెద్దలందఱును రుక్మిణిని శ్రీకృష్ణునకే యొసంగుటయందు తమ నిశ్చయాభిప్రాయమును వెల్లడిజేసియున్నారు.

మ॥ భగవంతుండగువాఁడు గూఢతరరూ ♦ పస్ఫూర్తి దాల్చ్యంతర
గ్నిగతిన్ యాదవవంశ చంద్రుఁడగుచున్ ♦ దీపించుటన్ దేవతల్
మిగులన్ భక్తి నుతింపుచుందు రతనిం ♦ బింబోష్ఠి యద్దానిచే
జగదాధారు వరించె మానసములో ♦ సందేహ మేలా యికన్.

విశా — యువరాజా!

తే॥ గీ॥ అవనిభారము వాపఁగా ♦ యదుకులంబు
నందు హరియె శ్రీకృష్ణుఁడై ♦ యవతరించె
నంచు నారదుండనఁగ నా ♦ లించినాఁడ
నట్టివానికిఁ గన్నె నీ ♦ యంగఁ దగదె.

ఆర్యా, నీతండ్రిగారు రుక్మిణీహృదయంబు వాసుదేవునిపైఁ జిక్కియుండుటచే నామె నాతనికే యొసంగి వివాహము గావింపఁ దలంచినారు. కావున నీవిందుల కంగీకరింపవలయును.

భీష్మ — (రుక్మినిఁ జూచి)

మ॥ తనయా! నీవు మదీయశాసనము త ♦ థ్యంబొప్ప జేయుందలం
చిన దుర్మాటలు పల్కకుండ నికనా ♦ శీతాంశు బింబాననన్
వనజాతాయత నేత్రుఁడైన హరి కు ♦ ద్వాహంబు గావింపఁగా
ననుమానింపక సమ్మతింపఁదగు సౌ ♦ ఖ్య శ్రీ విరాజిల్లెడున్.

విశా — (రుక్మింజూచి) రాకుమారా! మీతండ్రిగారి మాటలు వినుము. వారియెడల నీవు భక్తినిఁ జూపవలయును. పితృభక్తిని మించినదేదియును లేదు,

రుక్మి—మంత్రీ! విశారదా! నీవుఁగూడ నేమయినఁ బిచ్చిపట్టినదా యేమి! నీవుఁగూడ దండ్రిగారి యభిప్రాయమునందే యేకీభవించితివి. దొండపండు కాకి ముక్కునకు గట్టువిధమున రుక్మిణిని గృష్ణున కీయ నెంచితి రాయేమి!

(భీష్మకునిఁజూచి) తండ్రీ! ఈ యనవసరప్రసంగంబుతో నేమిపని యున్నది. రుక్మిణిని శ్రీకృష్ణున కిచ్చుటకు నాచిత్తం బెప్పుడును నంగీకరింపదు. నే నిదివరకే శిశుపాలున కిత్తునని సాల్వజరాసంధ దంతవక్త్రులముందుఁ బలికియున్నాను. హరిహరబ్రహ్మాదులు వారించినను నాపట్టు విడుచువాఁడను గాను.

సేవకుఁడు—(ప్రవేశించి) దేవా! దేవరదర్శనార్థమై యింద్రలోకంబునుండి యొక దూత యరుదెంచినాఁడు.

భీష్మ—వత్సా! రుక్మీ! ఆతని కెదురేగి తోడ్కొనిరమ్ము.

[రుక్మి—నిష్క్రమించి వెంటనే మణిగ్రీవునితోఁ బ్రవేశించును.]

భీష్మ—(దేవదూతం జూచి) దేవదూత కభివాదనము సలుపుచున్నాఁడ.

మణి—మహారాజునకుఁ జయమగుఁ గాక!

భీష్మ—ఆ యాసనం బధిష్ఠింపుము.

మణి—(ఆసీనుడగును.)

భీష్మ—దేవదూతరాకచే నాజన్మధన్యత వహించుటయే గాక పురంబెల్ల పావనత్వము వహించినది.

తే॥ గీ॥ కారణంబేదియో యొండు ♦ గలుగకుండ
నల్పులను ధన్యులం జేయ ♦ నరుగుదేర
రయ్య మీవంటి వారలో ♦ యనఘ చరిత
యెందు కరుదెంచితో చెప్పు ♦ మింపుమీఱ.

పవిత్రమైన భవదీయనామాక్షరంబు లెట్టివి. ఇప్పుడు నీరాక దేవేంద్రుని యొద్ద నుండియే కదా.

మణి—అయ్యా నాయభిధానము మణిగ్రీవుఁడు. దేవేంద్రునిపంపుననే నేను మీ కడ కరుదెంచితిని.

భీష్మ—మణిగ్రీవా!

తే॥ గీ॥ ఆ జయంత కుమారుతో • నమరనాథు
పత్ని పౌలోమి సేమమే • పాకవైరి
యష్టదిక్పాలకులతోడ • నలరుచున్న
వాఁడె సౌఖ్యంబులందుచుఁ • బలుకుమయ్య.

మణి — భూవల్లభా ! భగవత్కటాక్షంబున నందఱును సేమంబుగ నున్నారు.

భీష్మ — దేవేంద్రుఁడిప్పుడు నిన్ను నాయొద్ద కేలపంపించెనో చెప్పఁగవచ్చునా.

మణి — పంపినవాఁడను సందేశము తెలుపకుండ మఱలుదునా. వినుము. అనన్యసామాన్య సౌందర్యవతియగు భవదీయపుత్త్రి రుక్మిణికి వివాహముసేయ నిశ్చయించితి రని తెలిసి, యామెను శ్రీకృష్ణున కొసంగి వివాహము గావింపుమని చెప్పుమనెను.

రుక్మి — ఏమేమీ! యుక్తాయుక్తవిచారపటిష్ఠుఁడైన యమరనాథుఁడే యిట్లు పలుకుమనెనా! లేక మఱచిపోయి నీవే యిట్లు పలుకుచుంటివా !

భీష్మ — సందేశంబును సంపూర్తిగ వినకుండ నీవేల తొందరపడెదవు.

మణి — రాకుమారా ! దేవేంద్రునివాక్యంబులు నేను మఱచిపోయి పలుకలేదు. (భీష్మకునిఁజూచి) నృపాలా ! వినుము. ఈవాక్యంబు విబుధేశ్వరుండు నీతోఁ బల్కుమనెను.

మ॥ అవనీభారము బాపఁగాఁ దలఁచి దే • వౌఘంబు ప్రార్థింప యా
దవవంశంబునఁ గృష్ణుఁడయ్యె నురమా • ధారుండు నట్లౌటచే
భవదీయాత్మజ రుక్మిణీ రమణికిన్ • భవ్యాత్ముఁడౌ చక్రికిన్
భువిపాలైకశిఖామణీ పరిణయం • బుం జేసి వెల్గొందుమా.

ఇట్లు గావించితివేని శుభంబులు బడయఁగలవు. లేకుండెనేని నీవందుపాట్లకు మితిలేకయుండును.

రుక్మి — ఏమీ ! యీ దేవేంద్రునియొక్క వెఱ్ఱితనము. శుద్ధమూర్ఖుని నెవ్వనినో యొక్కనిఁ జేర్కొని యంతటివాఁడు చతుర్దశభువనంబుల లేఁడని, వాఁడు సాక్షాద్విష్ణుస్వరూపుఁడని యాధిక్యతగల్పించి లేనిపోనివి తెచ్చిపెట్టుచుండును. దీనిమూలంబున నెదుటివానికి మఱింత గర్వము హెచ్చుచుండును.

తే॥ గీ॥ పశులఁగాచెడి యాభీర ♦ వంశమందు
జన్మమందిన కృష్ణుని ♦ సత్కులీను
గా వచించి విష్ణుఁడని ప ♦ ల్కఁగ నమ్మ
తించెనే మానసము విబు ♦ ధేశ్వరునకు.

చాలుఁ జాలు. ఎవ్వరైన విన్న నవ్విపోవుదురు.
మణి—రుక్మి ! నీవెవ్వఁడును నట్లు తలంపవద్దు. ఆ శ్రీమన్నారాయణుండు,

తే॥ గీ॥ యదుకులంబున లీలకై ♦ యవతరించి
యిట్టి పనులనుసేయుచు ♦ నెగడుచుండె
నంతమాత్రముననె మహి ♦ మాత్ముఁడతఁడు
పశులఁగాచెడి కాపరి ♦ పాసినాఁడె.

అతఁడు జన్మమాదిగ నేటివఱకును జేసిన యద్భుతచర్యలు వర్ణించి చెప్పుటకు యుగంబులు పట్టును. పాలిచ్చు నెపంబున నీతనిని జంపదలంచివచ్చిన పూతన యితనిచే మడిసెను. ఈతనిచే బాల్యంబునందే యనేక రక్కసులు గూలిరి. ఇది యట్లుండనిమ్ము.

శా॥ గారాబంబున వానినెత్తుకొని చ ♦ క్కన్ నిక్కి కూర్చుండి పా
ల్గారన్ స్తన్యమునిచ్చి మేపుచును ♦ గాంచెన్ మహాచిత్రమా
నోరన్నాక ముఖావలోకములఁ ద ♦ న్మున్ వాని నాతల్లి క
న్నారన్ విస్మయమందె బాలుఁగని నీ ♦ వాలించితే రాసుతా.

ఒక సమయంబున బ్రహ్మ యితని మహిమంబులు దెలియఁగోరి గోగోపబృందంబును మఱుఁగుబుచ్చి విఫలమనోరథుండయ్యె. యమునయందు వసింపుచుండిన కాళీయుని గర్వంబడంచిపుచ్చెను. ఇది యంతయు నేల ! ముల్లోకకంటకుండైన కంసుని సంహరించిన విధంబు వర్ణింపదరమగునా !
రుక్మి—వందిగతి నాతని నేల నుతించెదవు. ఆతనిచర్యల నెవ్వరెఱుంగరు.

తే॥ గీ॥ మొదట వెన్నలు హరియించెఁ ♦ బిదపఁ బశులఁ
గాయగా మొదలిడె వల్ల ♦ వీ యువతుల

యంశుకములు హరించె బా ♦ ల్యంబునుండి
యిల్లి జారుఁడై చోరుఁడై ♦ యెగడువాని
హరియటంచును వచియింప ♦ నగునె నీకు.

ఉ॥ ఉండను గొంపనున్న పడి ♦ యుండగ మంచము నైన లేదు భూ
మండలమింత లేదు గుణ ♦ మాన్యతఁ గానము యట్టి కృష్ణు మా
యండజయానకుఁ బరిణ ♦ యంబును సేయుమటంచుఁ జెప్ప నా
ఖండలు డెట్లు బంపెను ♦ గణ్యతనెంచక తోఁచదయ్యెడుఁ.

మణి—ఓయీ! రుక్మి.

మ॥ వనిలోనెండకు వానకోర్చి మునులా ♦ భవ్యాత్ము నీక్షింపఁగా
ఘననిష్ఠఁ దపమాచరించియు వెసఁ ♦ గానంగ లేకుందురా
వనజాతాసన వాసవస్తుత పదా ♦ బ్జాతుఁ రమాధారునిఁ
విను మూఢాత్ముఁడెఱుంగఁగాఁగలడె పృ ♦ థ్వీపాల సత్పుత్రికా.

మనవంటి మూఢమతులా వాసుదేవునిమహిమ లెఱుంగఁజాలరు.

రుక్మి—సరే. ఇప్పుడా ప్రశంస యెందుకు. సుక్షత్రియవంశసంభూతయు త్రిలోక సుందరియు నగు మారుక్మిణిని గృష్ణునకిచ్చి వివాహము గావింపఁజాలము.

ఇందుకొఱకు సంకేతంబు ననుసరింపఁజాలనందులకు మిగుల చింతగానున్నది.

మణి—(స్వగతముగాఁజూచి) పిన్నపాపా! చూపులతో నాకేమి పనియున్నది. చెప్పవల సిన యుపాయము సంకేతముగా జెప్పితిని. కావున నాతని వాక్యంబుల ననుస రించి కృష్ణునకి రుక్మిణి నొసంగుదుము. ఇట్లు గావించితిరేని,

సీ॥ సర్వలోకానంద ♦ సంపాదక క్రియ
తావితోఁ గుసుమంబు ♦ దనరినట్లు
నరనాథచంద్రి స ♦ న్మాన్యమై శోభయు
మానికంబును నేక ♦ మైనకరణి
శృతికనుకూల ప ♦ ద్ధతిగల్గి వాగర్థ
ములు పరిస్ఫురమును ♦ గలియురీతి

జగదవనోత్సాహ ◆ సన్నద్ధ సంపద
శ్రీసతియుఁ బతియుఁ ◆ జెలగునటుల

తే॥ గీ॥ వరలుదురుగాక సతతంబు ◆ భవ్యభోగ
భాగ్య సంతానకీర్తి ప్ర ◆ పత్తితోడ
ధరణియందున నాచంద్ర ◆ తారకముగ
మహిమ రుక్మిణీ కృష్ణులు ◆ ఖ్యాతలేంద్ర.

తరువాత మీయిష్టము. ఇంక నే నరిగెద. (నిష్క్రమించును.)

భీష్మ—కుమారా! దేవదూతపలుకు లాలించితివా. ఇంద్రునంతటివాఁడుఁగూడ కృష్ణునకు కన్నె నొసంగుటయే శ్రేయస్కరంబని పలుకుచున్నాఁడు. కావున నట్లు సేయుటయే మంచిదని నా యభిప్రాయము.

రుక్మి—(కోపముతో) విన, గూడుతేని వెఱ్ఱిగొల్లని నధికునిగా భావించి యింద్రుఁడు పంపిన సందేశంబు విని మనరుక్మిణినిఁ గృష్ణున కీయఁదలంపుచుండిరా. నే నందులకు సమ్మతింపను.

తే॥ గీ॥ అడ్డుపడినట్టి వారిని ◆ నాజియందు
దునిమి చేదివల్లభునకే ◆ తోయజాక్షి
నిచ్చి యుద్వాహమును జేసి ◆ యెగడువాడ
పాకవైరికైనను భయ ◆ పడను సుమ్ము.

(నిష్క్రమించును.)

భీష్మ—విశారదా! ఏమిసేయుదును. కానిమ్ము. దైవవిధి యెట్లున్న నట్లగును. రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





# వైదర్భీవిలాసము.

## ద్వితీయాంకము.



[ విమల, భారతి అను నిరువురు చెలికత్తెలు ప్రవేశింతురు. ]

విమ—ఏమే భారతీ ! మనరుక్మిణివిషయమై నీవేమియాలోచించితివి.

భార—ఏమియాలోచింపఁగలము. శ్రీకృష్ణునిపైఁగల భ్రాంతియే యిట్లుచేయుచున్నది.

ఉ॥ చెంతకు నేరినైనఁగనుఁ ♦ జేరఁగనీయదు చెల్మికత్తెతో
మంతనమాడదింతయును ♦ మాటికిమాటికిఁ గృష్ణునెంచి శ్రీ
శాంతకుమారువేదనకు ♦ గాసిలిఁజెందుచు నున్నయట్టియా
యింతిమనోవికారమును ♦ నెట్టులబాపఁగ శక్తియానొకో॥

విమ—శ్రీకృష్ణునిఁ దెచ్చికట్టఁబెట్టినఁగాని యామెమనోవికారము బాయదు. కాని యామెపరితాపము చూడ మనకే జాలికలుగుచున్నది.

తే॥ గీ॥ జడను బూవులముడువదు ♦ సంతసమున
దనయభీష్టము తెలుపదు ♦ మనకునెపుడు
యింపుగా మనతో విహా ♦ రింపరాదు
వెలది శ్రీకృష్ణుపైనున్న ♦ బెంగచేత.

తే॥ గీ॥ ఈసడించును జేరిన ♦ నెవరనైన
దనకుఁదానె భాషించును ♦ మనసులోన
తల్పమందున బొరలు సం ♦ తసముదక్కి-
పడతితాపము చెప్పంగ ♦ వశమె నాకు.

ఇందులకుఁ గారణము నారదుండే. ఆకలహప్రియుండు వచ్చి కృష్ణునిఁగూర్చి యింతగా వర్ణించి చెప్పనేల. చెప్పెనుగాక! శ్రీకృష్ణుని చిత్రపటంబీమెకు నీయనేల? ఆమెకా చిత్రపటంబు నెదుట బెట్టుకొని తదీయసౌందర్య విశేషంబుల స్మరింపుచు మోహతాపంబు నందుటకన్న వేరొకపనియే లేదు.

భార—అట్లయిన రాజేంద్రుండు శీఘ్రముగా నీమెకేల వివాహముసలుపఁడు.

విమ—అందులకే యత్నముసేయుచున్నాఁడు. నేడో రేపో స్వయంవరము చాటఁ బంపును. కాని యేమిప్రయోజనమున్నది.

భార—విమలా! అట్లుబలుకుచుంటివేమి!

విమ—ఏమియునులేదు. రుక్మిణిని శ్రీకృష్ణునకిచ్చి వివాహముసేయుదురా లేదా యను మాటమాత్రము సందియముగ నున్నది.

భార—అందులకుఁ గారణమేమి!

విమ—అన్నీ! నీకుఁ జెప్పవలెను. నా నోరు నొప్పిపెట్టుచున్నది. అన్నియుఁదెలిసి యుండియుఁ దెలియనట్లడిగెదవు. రుక్మి రుక్మిణిని శ్రీకృష్ణున కిచ్చి వివాహము సలుపుట కిష్టపడుటలేదు. కన్నియను శిశుపాలున కొసంగుదునని ప్రతిన వహించియున్నాఁడు.

భార—అట్లయిన మనచెలి గతియేమి!

విమ—విధివ్రాత యెట్లున్నదో యట్లగును. దానిని దాటింప నెవ్వరుసమర్థులు. అదిగో మనరుక్మిణి చేతిలో శ్రీకృష్ణుని చిత్రపటముంచుకొని యిట్లువచ్చుచున్నది. మనమీవృక్షములచాటున డాగి యీమె యేమిభాషించునో చూతము. (చాటునకుఁబోవుదురు.)

[రుక్మిణి చేతిలో శ్రీకృష్ణుని చిత్రపటముంచుకొని ప్రవేశించుచున్నది.]

రుక్మి—(చిత్రపటముచూచి) ఆహా!

సీ॥ దివ్యరత్నప్రభా ◆ దేదీప్యమానమౌ
ఘనకిరీటము దలఁ ◆ గల్గువాఁడు
కటకాంగుళీయక ◆ గ్రైవేయకాంచికా
ప్రముఖసుందర భూష ◆ లమరువాఁడు
కౌస్తుభోజ్జ్వలిత వ ◆ క్షఃకవాటంబున
వైజయంతీమాల ◆ వరలువాఁడు

ఆజానులంబివృ ♦ త్తాయతపరిపీన
కమనీయ బాహుయు ♦ గంబువాఁడు

తే॥ గీ॥ మొలకనవ్వులుగల ముద్దు ♦ మోమువాఁడు
విమలజలజాతపత్రి నే ♦ త్రములవాఁడు
భక్తకరుణామయాత్ముఁడై ♦ పరఁగువాఁడు
శిష్టరక్షణుఁడైన నందుని ♦ చిన్నవాఁడు.

ఆనారదమునీంద్రుం డితని గుణవర్ణనము చేసిననాఁటనుండియు నాకీసుందరాంగునిపై భక్తియు మోహంబును జిక్కియున్నది.

తే॥ గీ॥ ధరణిభారముఁబాప యా ♦ దవకులంబు
నందు హరిజనించెను గృష్ణుఁ ♦ డనఁగ ననుచు
జెప్పియుండెను నారదుం ♦ డొప్పగాను
నాఁటనుండియు నితనిపై ♦ నాకుమనసు.

ఆహా! నేనెంత వెఱ్ఱిదానను. సాక్షాద్విష్ణుస్వరూపుండగు కృష్ణునిఁ బతిగాఁ గోరుచుంటినే!

మ॥ అతిమోహప్రవిభిన్నచిత్తనయి యం ♦ య్యబ్జాతపత్రేక్షణుఁ
బతిగాఁగోరి తపింపుచుంటి నిటునే ♦ బల్మారు నాకట్టి స
ద్గతి ప్రాప్తించునె యాశగాకను; సమ ♦ స్తైశ్వర్యసంయుక్తభూ
సతి నిర్భాగ్యులఁజేరునే మదిని నా ♦ సల్ జెందియున్నంతనే.

ఆయనంగసుందరుని నామనంబునఁ దలంచినంతనే శరీరము ఝల్లుమనుచున్నది. (ఇంచుకయూరకుండి) హా! కృష్ణా! యాదవవంశభూషణా!

చ॥ కమలభవాదులైన నినుఁ ♦ గానగజాలక యుందు రట్టి యా
గమవినుతప్రభావుఁ ద్విజ ♦ గన్నుత పాదసరోజు నిన్నునుఁ
విమలమతిఁ మనోధవుగ ♦ వేడ్కతో గోరుచునుంటి దీననై
కమలదళాక్ష సేవకని ♦ కావ సురక్ష విపక్షశిక్షణా.

దేవా! పురాణపురుషా! భక్తజనమందారుండవైన నీవు నామొఱాలించి నన్ను దప్పక జేఁబట్టుదువని యాసమాత్రము నాచిత్తంబున నున్నది.

శా॥ మాలాకారుఁడు నీకునవ్యసుమదా ♦ మంబుల్ సమర్పింపఁగా
వాలాయంబుగ నేలి; కుబ్జయునుదా ♦ నెంతో మహాభక్తితో
శ్రీలన్మీఱెడుగంధమీయఁగ ఘన ♦ శ్రీలిచ్చి కాపాడవే
శ్రీలక్ష్మీధవ నిన్వరించి నను నీ ♦ జేఁబట్టి రక్షింపవా.

(ఇంచుక యూరకుండి) అక్కటా! ఇది యేమిచూళ. అయ్యో కృష్ణుని గోరి నిరంతరంబును బరితపించుచున్న నాయభీష్టము దీర్పనెంచక నాయన్నయగు రుక్మి నన్ను శిశుపాలున కీయఁదలంచి యున్నాఁడఁట. అక్కటా! అగ్రజా! నీకు నేనేమి యపకారమాచరించితిని. దీనివలన నీవందులాభమేమున్నది. నీసోదరి ముద్దుఁజెల్లింపక నెవ్వఁడో దుర్మతుని దెచ్చి గట్టఁబెట్ట నెంచితివా! బాల్యంబునుండియు వాసుదేవునిపైఁ జిక్కియున్న నాచిత్తం బన్యథా చలించునా! (ఇంచుకనడచి) అయ్యో! నేనీ యుద్యానవనంబున కేలయరుదెంచితిని. డెందంబున కానందంబు గూర్చుచున్న యీమందమారుతంబును, తుమ్మెదల రవంబులును, చిలుకపలుకులును, కోకిలారవంబులును, నాహృదయ సంతాపంబును మఱింత యధికము సేయుచున్నవి. (ఇంచుక యూరకుండి) ఆహా! వాసుదేవుని నామోచ్చారణమాత్రమున నే మదనుండదయుఁడై తనపదునైన శరంబుల నాపై బఱపుచున్నాఁడు. మదనా! ఏమిదీ! అబలలమీది కొంటికాలిమీఁద పోవుదువే? విరహార్తులైనవారినిట్లు గాసిఁజేయుట ధర్మమా! శ్రీకృష్ణుని నేను చెట్టఁబట్టినయప్పుడు నీపరాక్రమంబు దెలియవచ్చును. జగములు రక్షించు విష్ణుమూర్తికి సుతుండవైన నీవిట్లబలల వేచుట పాడిగాదు. యెంతప్రార్థించినను నీదుష్టబుద్ధి మానవుకదా!

తే॥ దంపతులపైకి నీవును ♦ దాడివెడలి
వాడిశరముల జిమ్మంగ ♦ వచ్చుగాని
వాసుదేవునిఁబతిగాఁ ♦ బడయఁగోరి
వేచియున్నట్టి నన్నేల ♦ వేచెదీవు.

అక్కటా! మదనతాప మంతకంత కతిశయమగుచున్నది. ఇంచుకకాలమీ పూసెజ్జపై బవళించెద. (అని పరుండియుండును.)

[ విమల, భారతి, ప్రవేశింతురు. ]

భార — విమలా! శ్రీకృష్ణునిఁదలఁచితలఁచి మదనాతాపార్తిశయమై యీరుక్మిణి పండి యున్నది.

విమల — తే॥ గీ॥ చిగురుటాకులసెజ్జపైఁ ♦ జేరిపండి
జలజములబోలు కన్నుల ♦ జాఱుచున్న
బాష్పధారలు కాల్వలై ♦ పాఱగాను
మించువేదన బొందుసీ ♦ చంచలాక్షి.

భార — ఈమెనుజేరి పలుకరింతమా.

విమ — (రుక్మిణిచెంతకుఁ జేరి) చెలీ! రుక్మిణీ! రుక్మిణీ!

రుక్మిణి — కృష్ణా! ఆర్తత్రాణపరాయణా!

చ॥ చెలిననునేలుకోర; కను ♦ శీఘ్రగతిఁ జనుదేర! నిన్ను ని
శ్చలగతి; నమ్మియుంటిమది ♦ సంతసమార; మదీయసోదరుం
డలుక వహించి చైద్యునకు ♦ నర్పణఁజేయుగ నుండెనౌర; భ
క్తులఁగనకుంటమేర! నవ ♦ తోయజపత్రవిశాలలోచనా.

విమ — చెలీ! రుక్మిణీ! రుక్మిణీ! మేము నీచెలికత్తెలమగు భారతీ విమలలము. కన్ను తెఱచి మమ్మఁ జూడుము.

రుక్మిణి — చెలికత్తెలారా!

తే॥ గీ॥ మదనతాపంబు నిన్నాళ్ళు ♦ మగువలార
దాచుకొనఁగల్గితిని నింక ♦ దాపఁజాల
నామనసుహరించినయట్టి ♦ నందసుతుని
నిలనుగనకున్న ప్రాణముల్ ♦ నిలువవకట.

విమ — సఖీ! ఏల యీరీతి పరితాపమందెదవు.

తే॥ గీ॥ మదివిరాళిహెచ్చగనిట్లు ♦ మణివిభూష
ణములధరియించుటలుమాని ♦ నాతిమిన్న

కన్నులను బాష్పజలకణములు ♦ కాల్వలగుచు
పాఱుచుండంగ నీకేల ♦ భావమందు.

భార—అమ్మా! నీకు వేఱువ్యక్తులము గాము. ప్రాణసమానమైన చెలికత్తెలమే కదా. అట్టిచో నీసంతాపమునకుఁ గారణంబు మాయొద్ద దాచకఁ జెప్పుము. అందులకుఁదగిన శాంతి నాలోచించెదము.

విమ—సందియమందక జెప్పుము.

రుక్మిణి—తే॥ గీ॥ పడతి! మీకెల్లఁ బరిహాస ♦ పాత్రినైతి
అగ్రజునకేను బట్టునైతి ♦ నక్కటకట
నవ్వనయ్యెఁ దోడిసతులు ♦ నాదుబ్రతుకు
నేమిచెప్పుదు గారణం ♦ బిపుడు మీకు.

విమ—రమణీమణీ! నీవు మమ్ము వేఱుగ జూడఁదగదు. నిన్ను మేము పరిహాసమాడువారము కాము. నీసంతాపమును బాపుటకుఁ దగినమార్గ మరసెదము.

భార—విచారముడిగి నీసంతాపంబునకుఁ గారణంబు దెలుపుము. నీకు మే మెప్పుడును బ్రియంబుఁ గూర్చువారమని నమ్ముము.

రుక్మిణి—అయ్యో! ఏమిచెప్పుదును! వెన్నెల నాకు వేడియై తోచుచున్నది. మందమారుతంబులు గాడ్పులయినవి. శుకపికంబుల రవంబులు చెవులకు కఠోరంబులుగా నున్నవి. చెలీ! ఆమదనుని కైదువరంబులందు గానిపించు యది యసత్యము. అతఁడు తన చిగురాకుబాకుచే నాహృదయంబున గ్రుచ్చుచు బాణవర్షంబును నొక్కమొగిగా నాపైఁ గురిపించుచున్నాఁడు.

(నేల వ్రాలఁబోవును.)

విమ—చెలీ! యోర్చుకొనుము. (పట్టుకొనును)

రుక్మిణి—

ఉ॥ ఎప్పుడుగాంతునమ్మ తర ♦ ళేక్షణ కృష్ణముఖారవింద మే
నెప్పుడు విందునమ్మ రమ ♦ ణీ! మణి శ్రీహరిభాషణంబు; నా
కెప్పుడుగల్గునమ్మ కమ ♦ లేశునితోడను సంగమంబు; నిం
కెప్పుడు సంతసంబు ఘటి ♦ యిల్లును నాకు నెఱుంగఁ జెప్పరే॥

విమ—రమణీ! నీమనంబున నున్న పరితాపంబునకుఁ గారణంబు మాకుఁదెలిసినది.

ఉ॥ బేలతనంబుబూని శశి ♦ బింబనిభానన! యిట్టిభంగి గో
పాలకమూర్తినిందలఁచి ♦ భావమునందున నెందుకీవు యీ
వేళను చింతనొందెదవు ♦ వేడ్కలరారఁగ నేడొరేపొ; భూ
పాలురు చాటబంపుగద ♦ భవ్యస్వయంవర కార్యమెంతయున్.

భార—అందాకను నెట్లయినఁ దాళుము. ఇంతలో నేలత త్తరమందెదవు.

రుక్మిణి—అయ్యో! చెలికత్తెలారా! స్వయంవరమహోత్సవంబు గావించినఁదుగలన
నేమిప్రయోజనమున్నది.

ఉ॥ క్రూరతనంబుఁబూని యదు ♦ కుంజరుఁడౌ నలకృష్ణమూర్తి కిం
పారఁగనిచ్చినన్ బరిణ ♦ యంబును సల్పక; నీతిలేక నీ
ధారుణియందుఁ జైద్యునకు ♦ దప్పకనిత్తునటంచు రుక్మి; తా
ఘోరప్రతిజ్ఞఁదాల్చెనిఁక ♦ గోమలులార మనంగనేర్తునే.

విమ—అమ్మా! ఈప్రతిజ్ఞలన్నియు సాగునవికావు. నీమానసంబు బాల్యంబునుండి
యు, నందనందనునియందుఁ జిక్కియున్నది. భక్తపరతంత్రుండైన యావా
సుదేవుండెట్లయినను స్వయంవరమ్మున కరుదెంచి నిన్నువివాహమాడఁగలఁడు.
చింతింపకుము.

రుక్మిణి—సఖులారా!

ఉ॥ మానసచోరుఁడైన హరి ♦ మానితసత్కృప బూనినాయెడన్
మానకనన్నుఁజేకొనఁ ♦ మంచితలీలను రాకయున్నచో
నీనిరవద్యవైభవము ♦ లీసుకుమార వయోవిలాసముల్
కానననీమఁగాయు నవ ♦ కౌముదికిన్ సరిగాదెకోమలీ.

సీ॥ శ్రీనాథుపదములు ♦ సేవింపనొల్లని
కరములు శోచనా ♦ కరములగును
హరినిఁబూజింపగా ♦ బరువెత్తకున్నట్టి
పదములు దూషణా ♦ స్పదములగును

నమరేంద్రవంద్యుని ♦ నర్చింపకున్నట్టి
భవము పాపౌఘ సం ♦ భవమెయగును
విశ్వాత్మరూపంబు ♦ వీక్షింపజాలని
నయనముల్దీనతా ♦ నయనములగు

తే॥ గీ॥ నీరజాక్షుని సంస్పర్శ ♦ నియతిలేని
తనువునఘసంఘసంశ్రయా ♦ తనువెయగును
పరమపురుషు కథాతతిఁ ♦ బాడలేని
ముఖము దోషవితానైక ♦ సఖముయగును.

తే॥ గీ॥ భక్తకరుణామయాత్ముఁడై ♦ పరగువాని
శ్రీసతికిభర్తయగుచునుఁ ♦ జెలఁగువాని
బరిణయంబాడకున్నను ♦ బడతివినుము
తనువుత్యజియించుటేనాకుఁ ♦ దగును చెలియ.

భార—రమణీ ! ఎందుకీపరితాపము. అంతయవసరము నీకులేదు.
విమ—

ఉ॥ కాంతరో నీవుచిత్తమునఁ ♦ గంజదళాయత నేత్రుఁగూర్చి శ్రీ
కాంతకుమారుతాపులకు ♦ గందుచుఁ గుందగ నేల నిట్లు ని
శ్చింతమనస్కురాలవయి ♦ చెన్నుగనుండుమమ్మ ; తప్పకుండ శ్రీ
కాంతుఁడువచ్చి పెండిలినిఁ ♦ గ్రన్ననయాడెడు నిన్ను నమ్ముమీ.

రుక్మిణి—దైవకృపయున్నచో యదుకుంజరునిఁ బరిణయంబాడుట; లేదేని ప్రాణములు వీడుట. ఈరెంటిలో నేదియేని తప్పక జరుగును గావున ధైర్యచిత్తనయి యుండెద.
భార—అమ్మా ! యువరాజుగారిట్లు వచ్చుచున్నారు.
రుక్మిణి—నాయగ్రజుండగు రుక్మియా !
విమల—అవును. (పోగదా.
భార—(రహస్యముగా) విమలా ! ఈయనయిప్పుడిచ్చటి కరుదెంచుట కేమికారణ

విదు—ఆ కారణము మన కేమి తెలియును. అయినను వివాహవిషయమై యేదియేని యు చ్చటించుటకేమో. మనకిప్పుడే తెలియునుగదా. "తినబోతూ రుచులడుగ నేల!"

[ రుక్మి ప్రవేశించుచున్నాఁడు. ]

రుక్మి—(ప్రవేశించి) ఇదిగో! నాసోదరియగు రుక్మిణి తన చెలికత్తెలతో నిచ్చటనున్నది. శ్రీకృష్ణునిపైఁ జిక్కియున్న యీ మెచిత్తంబు నెట్లయిన మరల్చి శిశుపాలునకిచ్చి యుద్వాహంబు సలుపనలయును. (రుక్మిణిని సమీపించి) చెల్లెలా రుక్మిణీ!

రుక్మిణి—అగ్రజా! రుక్మీ! ఇటురమ్ము. ఇవ్వనంబున నున్న నాకడ కంతతొందరగా నేమికార్యార్థమై యరుదెంచితివి!

రుక్మి—ఏమియును లేదు.

తే॥ గీ॥ చారుశారద పూర్ణిమా ♦ చంద్రుఁబోలె
వెలుగుచుండెడి నీముఖ ♦ బింబమిట్లు
వాడె నేటికి నిశియందుఁ ♦ బద్మమట్లు
కారణమదేమి దీనికిఁ ♦ గంబుకంఠి.

తే॥ గీ॥ జీర్ణమైకడుమాసిన ♦ చేలమేల
కట్టగావలసెనునీకుఁ ♦ గలికిమిన్న
పొందుగా నవరత్న ♦ విభూషణంబు
లేలధరియింపకున్నావు ♦ బేలవగుచు.

అమ్మా! నీవిట్టి నీచస్థితినిఁ బొందుటకుఁ గారణంబేమియు నాకు గోచరముఁగాకున్నది

రుక్మిణి—అగ్రజా! ఏమియును లేదు.

రుక్మి—రేప చెల్లుండి స్వయంవరము చాటఁబంచి మనతండ్రిగారు నిన్ను శిశుపాలునకిచ్చి వివాహముసేయ నిశ్చయించియుండఁగా నీవిట్లుండుట పాడియగునా!

రుక్మిణి—(తనలో)

మ॥ కలయా! నిక్కువమా! భ్రమించితిన కాంక్షన్ రుక్మియివ్వాక్యముల్
బలుకన్ జాలెన! నాదుతండ్రి యకటా ♦ భావించెనా! నన్నునన్

లలిజేదీశునకిచ్చి పెండిలినొగిఁ గావింపగా! రుక్మిణీ
లలనన్ నేనెకదా! శరీరమునఁ దాల్పఁ శక్యమే ప్రాణముల్.

(ప్రకాశముగా) అన్నయ్యా! శ్రీకృష్ణున కొసంగి వివాహముసేయ నిశ్చయించెనని చెప్పుటకు మారు శిశుపాలునకని చెప్పియుందువు. జ్ఞప్తికిఁదెచ్చుకొమ్ము.

రుక్మి—చెల్లెలా! అవివేకివై మనజనకుండు మొట్టమొదట యట్లేతలంచెఁ గాని యందు సాధకబాధకంబులఁ దెలిపి నిన్ను శిశుపాలున కీయ సమ్మతింపఁజేసితిని.

రుక్మిణి—అయ్యో! నీమూర్ఖతకు నేనేమని చింతింతును.

మ॥ వరభూపాదులొసంగుటొ ప్రియమెలర్పఁ జీరలఁ దెచ్చి భా
స్వరతఁ గట్టఁగఁబెట్టి ముచ్చటలుదీర్పఁ దలంపూనుటో
తరుణీరత్నము గోరుకొన్నవరు మోదంబారగా దెచ్చి సొం
పరయఁ బెండిలి గూర్చుకుండుటది భావ్యంబొనె; యోచింపుమా.

అన్నయ్యా! నాచిత్తవృత్తి నెఱింగియును నిట్టియకార్యము నేలచేయ సాహసించితివి. నీ చెల్లెలనగు నాకు నేనుకోరిన వరునిఁదెచ్చి వివాహముసలిపి మేమిరువురము సౌఖ్యాంబుధి నోలలాడుచుండఁగాఁ జూచుటకు మాఱుగా నాగొంతుకఁ గోయ నెంచితివా!

రుక్మి—(తనలో) శిశుపాలునియందుఁ దనకిష్టము లేదను యభిప్రాయము సూచించుచున్నది. (ప్రకాశముగా) అమ్మాయీ! నీవట్లుఁబలికెదవేల. ఇందునీకిష్టము గాని కార్యమేమున్నది.

రుక్మిణి—నాచిత్తవృత్తి నీవెఱుంగవా!

శా॥ బాల్యంబాదిగ జిక్కెనాహృదయమా పద్మాక్షుగోవిందుపై
తుల్యుండాతఁడు శ్రీరమాపతికి సంతోషంబు దీపింపఁగాఁ
గల్యాణంబొనరించి నాకతనితో జ్యోత్స్నామండలిఁ నీదుసౌ
శీల్యంబుఁ దగవెల్లడింపుమిఁక నేఁ జేమోడ్చి ప్రార్థించెదన్.

రుక్మి—(తనలో) ఈమెనిశ్చయాభిప్రాయంబును వెల్లడించినది. కానిమ్ము. ఈమె హృదయంబు నెట్లయినను ద్రిప్పవలెను. (ప్రకాశముగా) సోదరీ! నీవు యుక్తాయుక్తపరిజ్ఞానరాలవు. అకలవాశనుండగు నారదుండుదేవిపొా కృష్ణునిఁ

గూర్చి యున్నవి రెండును తెలివిరెండును గల్పించి పక్షించి చెప్పినంతనే నీవి తత్వంబతని యందుఁ జిక్కినదిగాని యందలి సాధకబాధకంబులు నాలోచించి యుండలేదు.

తే॥ గీ॥ మధువరో! నేను నీదు క్షే ♦ మంబుగోరి
చెప్పచుండువాఁడనెగాని ♦ యుప్పుఁగూర్చు
వాఁడనని దలంపఁగబోకు ♦ భావమందు
నెంచ; మంచిదా! కృష్ణు వరించ నీవు.

అమ్మాయీ! విద్యావంతురాలవు. నీకొరకు చెప్పవలెనా! కృష్ణునకును శిశుపాలునకును హస్తిమశకాంతరముకదా. అతఁడు జనించిన కులంబెద్దియో నీవెఱుంగవా! పేదగొల్లడైనవానినిఁ బరిణయమాడఁదలంచితివా!

రుక్మిణి — సోదరా! ఇట్టివాక్యములతో నేమిపనియున్నది.

ఉ॥ యాదవవంశమందు; నసు ♦ రారులు బాధ్రిగ్ధనసేయఁగాంచి య
త్యాదరలీల భూభరము ♦ నంతయు వాపదలంచిపుట్టె దా
మోదరుడిట్లుగాని యదు ♦ పుంగవుడేయని యెంచబోకుమీ
భేదమొకింతలేదుసుమి ♦ వీనికి నాహరికిన్ నిజంబుగన్.

అమ్మ వాసుదేవుని సామాన్యమర్త్యునిగాఁ దలంపఁదగదు.

రుక్మి — అమ్మాయీ! "తానలఁచినది రంభ, తామునింగినది గంగ" యనునట్టులు నీయందు సత్యమగుచున్నవి.

సీ॥ వ్రేపల్లెవాడలో ♦ గోపకాంతలచెంత
సిగ్గింతయునులేకఁ ♦ జెలఁగువాని
యుల్లిల్లుజరియించి ♦ యేదియోదొబ్బుచు
జనులచేఁ జీవాట్లుఁ ♦ దినెడువాని
జలకేళినున్నట్టి ♦ జవరాండ్రచేలముల్
గొని మానములఁజూచు ♦ కొంటెవాని

పెరుగు పాలోయమ్మ ♦ వేఁగొనరంచును
నలరువారికి సుతుం ♦ డైనవాని

తే॥ గీ॥ శ్రీరమాధీశుఁడంచును ♦ జిత్తమందు
దలచి రాజులెల్లరునవ్వ ♦ లలితగతిని
బరిణయంబాడ నెంచితే ♦ పద్మగంధి
యిద్ది వెఱ్ఱితనముఁగాదె ♦ యెంచిచూడ.

సుక్షత్రియవంశ సంభూతవై యఖండరాజ్యలక్ష్మీమనోహరుండైన భీష్మకనృపాలాగ్రణికిఁ బుత్రికవై, బలపరాక్రమవంతులగు సోదరులకు భగినివై తుదకు గొల్లయింటి కోడల ననిపించుకొనుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది. మేమింక నలువురలోఁ దలయెత్తి మెలఁగఁగలమా.

రుక్మిణి—అమ్మహాత్ముని మహాత్మ్యంబు మనబోటి మూఢాత్ము లెఱుంగఁజాలరు.

ఉ॥ కాననసీమలందున నఖండతపంబును జేసినైన యా
దానవవైరి సన్మహిమఁ ♦ దథ్యముగా నెఱుగంగఁజాలరా
మానులునైన నట్టియెడ ♦ మాధవుదివ్యమహాత్మ్య సంగతుల్
నీవును నేనునుం దెలియ ♦ నెంతటివారము సోదరాగ్రణీ.

అతడుచేసిన బాల్యక్రీడల నేవియో పేర్కొని వెఱ్ఱిగొల్లఁడని చెప్పసాహసించితివి. పాపము మూటఁగట్టుకొంటకే యిట్టిపలుకులఁ బలుకుచుంటివి.

రుక్మి—నీవెంతచెప్పినను నాగొల్లనికి నిన్నుకట్టిపెట్టుటకు నామనంబు సమ్మతింపదు

తే॥ గీ॥ పవ్వళించుటకొక్క త ♦ ల్పంబులేదు
యేలుటకు గోష్పదంబంత ♦ నేలలేదు
కోర్కెమై భుజియింపఁగాఁ ♦ గూడులేదు
వెఱ్ఱిగొల్లని నీరీతి ♦ వినుతిఁజేతె.

రుక్మిణి—అమ్మహాత్ముని నిందకుఁ బాత్రునిఁగాఁ జేయకుము. అన్నయ్యా! వేయేల! నాచిత్తంబాతనియందు గట్టిగాఁజిక్కియున్నది. అన్యథా చలింపదు, నీచెల్లె

లిముద్దుఁ జెల్లింపఁదలంచినవాఁడవేని, నన్నుఁ గృష్ణునికిచ్చి పరిణయంబునుఁ జేయుము. కాదేని నామరణంబునకు నీవు కారణుండవగుదువు.

రుక్మి.—అమ్మాయీ! చాలు నీసాహసము.

ఉ॥ చేలతనంబుఁబూని యర ♦ విందదళేక్షణ! గొల్లడైన గో
పాలునిఁగూర్చి యీక్రియ స్త ♦ వంబులు జేసెదవేలనమ్ము; భూ
పాలకులెల్ల నవ్వరె వి ♦ వాహముజేసిన వానికిన్; ధరా
పాలురు బల్వురుండఁగను ♦ భాగ్యమె నీకిది వానిఁగైకొనన్.

తే॥ గీ॥ సంపదలయందు మఱియు రా ♦ జ్యంబునందు
నమితధనమందు ఘనపరా ♦ క్రమమునందు
మిగులదీపించు రాజులు ♦ జగతియందు
లేరె! పరిణయంబాడఁగా ♦ లేమ! వినుము.

ఇంకనిట్టి పలుకులఁ బలుకకుము. విన్నచో నెవ్వరైన నవ్విపోదురు. నిన్ను నేను చేదిపురాధీశ్వరుండగు శిశుపాలున కీయనిశ్చయించితిని. ఆతనిసంగతి యంతయు నీవిదివరకే వినియుందువు. అతఁడు సామాన్యనృపాలుఁడు గాడు. బలపరాక్రమములయందుగాని, సంపదయందుఁగాని, సౌందర్యమునందుఁగాని కృష్ణుఁడీతని గోటికైనను నెనఁగాడు.

సీ॥ రాజిల్లుచున్నాఁడు ♦ రాజులందఱిలోన
నలజరాసంధుండు ♦ హార్ద మంద
దీపింపుచున్నాఁడు ♦ దివ్యభాగ్యముతోడ
నితరభూపులకు గ ♦ న్నెఱ్ఱగాఁగ
విహరింపుచున్నాఁడు ♦ వెలలేని బలమున
సాల్వాదులెల్లరు ♦ సఖులుగాఁగ
భంజింపుచున్నాఁడు ♦ బవరంబులందున
నెదిరించినట్టి మహీశ్వరులను

తే॥ గీ॥ నట్టి శిశుపాలుఁ జేదీశు • నమలచరితు
మన్మథాకారు సుగుణాఢ్యు • బరిణయుంబు
నాడి; భూతలంబందు సౌఖ్యంబునందు
మా! వెలఁదులుమెచ్చగ రుక్మి • ణీ వధూటి.

నీసౌఖ్యంబునుఁగోరి పలుకుచున్న నానుడులాలింపుము.

రుక్మిణి—అన్నయ్యా! నీవెంత చెప్పినను నాచిత్తంబుఁ జలింపదు. అట్టియెడల నీవిప్పుడు చెప్పిన శిశుపాలుంగూర్చి నీతోఁ బ్రశంసించుట నాకేమియును నవసరములేదు. నాసౌఖ్యంబును గోరినవాడవేని శ్రీకృష్ణున కర్పింపుము. అంతియేగాని యితరుల వరింపుమని బోధింపకుము. బోధించినను వినను. దైవసంఘటన యెట్లున్నదో యట్లగును.

రుక్మి—రుక్మిణీ! నీవుపట్టినపట్టు విడువవా!

రుక్మిణి—ఇందుపట్టేమున్నది. నాయందుఁగరుణవహించి కృష్ణునను వన్నిచ్చి వివాహముసలుపవా!

రుక్మి—నీవు కృష్ణుని వరించితివి! కృష్ణుండు నిన్నుఁ గైకొనకపోయినచో నేమిచేయుదువు.

రుక్మిణి—

చ॥ గరళము లేదె గ్రోలఁగను • ఖడ్గముచిక్కదె గొంతుకోతకై
వరనదులెల్ల యింకినవె • భవ్యతటాకము లుండకున్నవే
యురికిని త్రాడుగల్గదొకో • యుర్విని నన్నలమాధవుఁడు స
త్పరిణయమాడకుండిన గృపామతిగాక! నిజంబుఁ జెప్పితిన్.

రుక్మి—కానిమ్ము. దైవఘటన యెట్లున్నదో చూచెదఁగాక!

(నిష్క్రమించును.)

రుక్మిణి—(చెలికత్తెలనుఁ జూచి) సఖులారా! వింటిరిగదా. నాయగ్రజుని వాక్యములు. అయ్యో! ఎట్లయినను నన్నా శిశుపాలున కిచ్చి వివాహముసేయనెంచినాఁడు. అక్కటా! నాకా కృష్ణునిచెలిమి ప్రాప్తించదుకాఁబోలు. ఆవిధాత నానుదుట బలవంతముగాఁ బ్రాణముల బాయుమని వ్రాసిపెట్టెనుకాఁబోలు.

విమ—సఖీ! నీవు వేలవై యీలీల చింతింపఁబోలదు. బ్రహ్మ మానసపుత్రుండయిన నారదుండు నీకుఁ దప్పకఁ గృష్ణుండే పతియగునని చెప్పలేదా! తపోధనుల వాక్యంబులు రిత్తపోవునా!

భార—అమ్మా! నీవేధమగు సంతాపంబును మనంబునఁ బెట్టుకొనక ధైర్యంబువహింపుము. ఆశ్రితరక్షకుండగు దేవకీనందనుండు నిన్నురక్షింప నరుదెంచి తీరును.

విమ—అమ్మా! నీ సంతాపమువాయ కొంతసేపీవనంబున విహరింతము. పూలతరుల పైనుండి వీచు మందమారుతం బించుక నీడెందంబునకు సోకినచో నీతాపము కొంత తగ్గును.

రుక్మిణి—అబ్బా! చెలులారా! నే నడువఁజాలను. విమలా! నీవరిగి నానావిధకుసుమంబులనుఁ గోసికొనిరమ్మా. మందిరంబున మాధవవిగ్రహంబునుఁ బూజింపవలయును. భారతీ! నీవరిగి రహస్యముగా వివాహవిషయమైన విశేషంబుల నారసిరమ్మా. నే నిచ్చట నించుకకాలము విశ్రమించి యుండెదను.

విమ } మంచిది. (నిష్క్రమించుచున్నారు.)
భార }

రుక్మిణి—(స్వగతము) అక్కటా! ఇప్పుడు నే నేమిసేయుదును. శిశుపాలునకే తప్పక యిచ్చి వివాహముసేయుదునన్న నాయగ్రజుని మతము నెవ్వరు దిప్పఁగలరు. అతనిమూర్ఖత బాపువారెవరు! (రుక్మినుద్దేశించి) అగ్రజా! రుక్మి! నీకిది యేటి వెఱ్ఱితనము. చెల్లెలుసౌఖ్యపడుచుండఁగా నీవువీక్షింపలేవా! నన్నుసురుఁబెట్టుట నీకుసంతోషమా! నాసౌఖ్యము నీసౌఖ్యముగాదా. అయ్యో! నీకిట్టికార్యముసేయుట యధర్మమని బుద్ధిగఱపువారెవ్వరును లేరా! కాకున్న నెవ్వరు చెప్పినను వినకుంటివా! (ఇంచుకయూరకుండి కృష్ణునుద్దేశించి) హా! కృష్ణా! భక్తపరతంత్రా! నామొరాలకింపుచుంటివో లేదోకదా!

మ॥ అతిసౌందర్యవిలాసు; నన్నును వివా ♦ హంబాడ నేనుండ; దు
ర్మతుఁడై నట్టి మదీయసోదరుఁడు దు ♦ ర్మార్గుండునా చేది భూ
పతి కర్పింపఁగ నున్నవాఁడు; కరుణన్ ♦ బాలించి రక్షింపవే
శ్రితచింతామణి! దేవకీతనయ! ల ♦ క్ష్మీమందిరోరస్థలా.

[ శ్రీకృష్ణవేషమున శిశుపాలుఁడు—ప్రవేశము. ]

శిశు—(తనలో) ఇప్పుడు నేను శ్రీకృష్ణునివలెనే యుంటినా! రుక్మిణి నన్నానవాలు పట్టలేదుకదా. ఆనవాలుపట్టినను నన్నేమిచేయఁగలదు. కాని నలువురువిన్న

చో నాకు నగుబాట్లగును. నామాయ నొక్కింతయు బయలుపడకుండ నీమె యొద్ద భాషింపవలయును. (రుక్మిణియెదుటనుంచి నడిచిపోవును.)

రుక్మిణి—(శిశుపాలుంజూచి) ఏమిది! ఆశ్చర్యముగనున్నది. స్త్రీలు విహరించు నీయుద్యానవనంబున కెవ్వరో పురుషుండు వచ్చినాడే! ఈతఁడెవ్వఁడైయుండును. చెలికత్తెలుఁగూడ లేక నొంటిగనైయుంటి. ఏమియుఁ బ్రమాదము సంభవింపదు కదా.

శిశు—[రుక్మిణిని సమీపించి] (తనలో) నేనును సమయంబునకే వచ్చితిని. చెలికత్తెలెవ్వరును లేక యొంటిగానే యున్నది. ఆహా! ఏమి ఈమెసౌందర్యము!

తే॥ గీ॥ సర్వలావణ్యసారముల్ • సంతరించి
తనదునేర్పును జూపఁ బి • తామహుండు
సకలలోకంబులను మోహ • జలధిముంచ
నబ్జనేత్రిని సృష్టించె • ననుచుఁదోచు.

ఈమెను పలుకరించి చూచెదను గాక! (ప్రకాశముగా) అమ్మలమిన్నా! యొంటిగ నుంటివేల!

రుక్మిణి—(తనలో) ఈతఁడెవ్వరో నాకుఁ దెలియకున్నది. వేషముచూడగా శ్రీకృష్ణునివలెఁ దోచుచున్నది. భక్తరక్షణపరాయణుండగు నాతఁడు నన్ను ధన్యురాలిం జేయఁదలంచి యరుదెంచి యుండడుకదా. ఆతఁడెట్లరుదెంచును. స్వయంవరంబింకను జాటఁబంపలేదుకదా. ఇదియేమో నాకు మిగుల నాశ్చర్యముగనున్నది. శిశుపాలుండిచ్చటి కరుదెంచినాడని వినియుంటి. ఒకవేళ నన్ను వంచింపఁదలంచి యాతఁడే యీవేషంబున వచ్చియుండడుగదా. ఇప్పుడీతనితో నేను సంభాషించుదునా మానుదునా! అయినను నీతని నిజసంగతిఁ గనుఁగొని తీరవలయును. (ప్రకాశముగా) ఓ! పురుషవర్యా! మీరెవ్వరో నాకుఁ దెలియదు. అంతఃపురకాంతాజనంబు విహరించు వనంబున కేలవచ్చితివి?

శిశు—రమణీ! నారూపురేఖావిలాసంబులఁబట్టి నేనెవ్వరినో గుర్తింపనేరవా?

రుక్మిణి—తెలియక నేకదా యడిగితిని.

శిశు—నీవు బాల్యంబునుండియు నెవ్వరిపైఁ జిత్తంబును జిక్కఁజేసితివో యట్టి.

రుక్మిణి—అనఁగా నాకుఁదెలియలేదు. నీ నామమెయ్యది.

శిశు—నా పేరా! శిశు శిశుపా. శ్రీకృష్ణుఁడు.

రుక్మిణి—(తనలో) ఈతడు పేరుం జెప్పుటకు దడబడి "శిశు" యని యంతటనాపి శ్రీకృష్ణుం డనిచెప్పెను. ఒకవేళ నేను తలచినట్లు శిశుపాలుండే యిట్టి వేషమున వచ్చియుండెనేమో! ఏమోగాని నాయొడలు కంపమెత్తుచున్నది. అయినను ధైర్యమువహించి యుండెదనుగాక. (ప్రకాశముగా) నీవు నిజముగాం గృష్ణుండవేని కాంతలు విహరించు స్థలంబునకు రహస్యముగా రా బనియేమి!

శిశు—నిన్ను వివాహామాడుటకు!

రుక్మిణి—అట్లయిన రాజసమ్ముఖంబున కేగవలెనుగాని యిట్లు చేయుదురా. (తనలో) నిజముగా నీతండు కృష్ణుండేని యీతనిసేవకై నాచిత్త మేల పఱుగువారక యుండును!

[ తెరలో ]

తే॥ గీ॥ నిన్నువంచింప మదిలోన • నిశ్చయించి
చేదిభూపాలకుండిట్లు • శీఘ్రగతిని
కృష్ణవేషము ధరియించెం • గీరవాణి
నమ్మగాబోకు మీతని • నెమ్మనమున.

రుక్మిణి—(కోపమున) ఔరా! ఎంత మోసపుచ్చితివి! నీవు శిశుపాలుండవన్న సంగతి తెలిసియున్నచో నీతో సంభాషించియుందునా!

తే॥ గీ॥ ఒంటియగుచును నున్నట్టి • యువిదకడకు
వచ్చి భాషింపుమంచును • బ్రహ్మనీదు
నుదుటవ్రాసెనే; యోరోర • మదముచేత
యిట్టికార్యంబు జేతువే • హీనచరిత.

ఇట్టి దుష్కర్ములు ప్రబలుటచేతనే భూభార మెక్కువైనది. ఆభూభరము వాపుటకే శ్రీకృష్ణుండు జన్మించి యున్నాండు.

శిశు—రమణీ! నామాట నొక్కింతవినుము.

తే॥ గీ॥ నిన్ను నాకిచ్చి పెండిలి • నేయ రుక్మి
మనమునందున నెంచెను • మగువ వినవె

యింతలో నింత తొందర ♦ యేల నీకు
నెవ్వరైన నను విన్నచో ♦ నవ్విపోరె.

నీవు నేడో రేపో తప్పక నాయధీనమగుదువు. ఈ యీసడింపుమాటలతో నేమి ప్రయోజనమున్నది.

రుక్మిణి—సరియైన సంభాషణజేయుము. నాపై నీకీ యట్టియాస యెందులకు? వేదపారంగతుండైన విప్రునితోఁ జెలిమి ఛండాలునకు సంభవింపదుగదా! మానస సరోవరంబున విహరించు రాజహంసతో మైత్రి కాకంబునకు సంభవించునా!

తే॥ గీ॥ భవ్యతపము జేసినఁగాని ♦ బడయ లేవు
నన్ను; నాచిత్త రాజమా ♦ నంద సుతుని
పైన; జిక్కియే యున్నది ♦ వట్టి యాస
వీడు నీమది యందున ♦ వేమదాన.

శిశు— తే॥ గీ॥ వెఱ్ఱి గొల్లడు కృష్ణునిఁ ♦ బెండ్లియాడి
నారులెల్లరు నిను జూచి ♦ నవ్వునట్లు
భాగ్య సంపద లేనట్టి ♦ వానితోడ
నేమి సౌఖ్యంబు నందెదో ♦ యింతినీవు.

రుక్మిణి—నీకంటె కాతఁడట్లు గనిపించుచున్నాఁడు. మీరు సహజవిష్ణు ద్వేషులుగదా. మీ రూపుమాపుటకే యతఁ డవతరించినాఁడు.

శిశు—తరుణీ! అనవసర ప్రసంగముతో నాకుఁ బనిలేదు. నిన్నిప్పుడు తీసికొనిపో దలంచినచో నాపని చేయగలనుగాని నీ యిష్టమువిూదనే తీసికొనిపో దలంచితిని. నీవందుకు సమ్మతింపవేని బలవంతముగ నిన్నిప్పుడే చేదిపురంబుఁ జేర్పగలను.

రుక్మిణి—ఒరీ! తుచ్ఛుడా! నామేనఁ బ్రాణంబు లుండఁగా నంత సాహసకార్యము నీవు సేయగలవా! ఒకవేళ తీసికొనిపోవుదువుగాక. ఏమి ప్రయోజనము.

“మ॥ ఘనవైరాగ్యము లేనియోగము వివేక భ్రష్టమౌ త్యాగముఁ
దను మోహింపనిరాగముఁ బరివశత్వ ప్రాప్తమౌ భోగముఁ

వినుమన్యాయమొనర్చ భాగమును బుత్త్విగ్గర్హమౌ యాగముః"
వినుతింజెందక వ్యర్థమై చెడును నుర్వీపాల చైద్యాధమా.

శిశు—తరుణీ! కాలహరణంబునకు నాచిత్తము సైపదు. ఇంక పోవము రమ్ము. నిన్నుఁ ద్రుటిలో చేదిపురంబు జేర్చుటకు సాళ్వునడిగి విమానంబు దెచ్చితిని.

రుక్మిణి—దురాత్మా! నన్ను బలవంతంబుగఁ గొనిపోవుటకా నీవరుదెంచితివి! (తనలో)

మ॥ బలవంతంబుగనైన నన్నుఁ గొనిపో ♦ వఁగ జిత్తముందెంచి యి
ప్పుడు చైద్యుండరుదెంచినాఁడు కనవే ♦ పుణ్యాత్మకా నీపదం
బుల నశ్రాంతము భక్తిమై గొలుచు ని ♦ ప్పూబోడి కీర్తి సి
గ్గులఁ గల్పింతువె బ్రోవవే గుణమణీ ♦ గోపాల చూడామణీ.

[అంత తొందరగా నొక రక్కసుండు ప్రవేశించి]

రక్క—తే॥ గీ॥ మాధవాధీన యైనట్టి ♦ మగువనిట్లు
తస్కరించుక పోవంగఁ ♦ దలఁచినట్టి
ధర్మగుణహీనునకు నీకుఁ ♦ దగినశిక్ష
సేయుచున్నాడ నిప్డు పీ ♦ క్షింపుమిదిగో.

(అని నెత్తిపైఁ దన్నఁగా శిశుపాలుఁడు మూర్ఛిల్లును.)

రుక్మిణి—నే నేగుట కిదియే సమయము. భగవంతుఁడు నన్ను రక్షించినాఁడు. అదిగో నా చెలికత్తెలుగూడ వచ్చుచున్నారు. వారిం గలసికొందును.

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





# వైదర్భీవిలాసము.

## తృతీయాంకము.

[రంగము—ద్వారకాపురమున వనమందు శ్రీకృష్ణుఁడు రుక్మిణి చిత్రపటముతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

కృష్ణు—(పటమును జూచి) ఆహా!

మ॥ అమరస్త్రీతతులన్ గణింప దురగ ♦ శ్యామా సమూహంబు ను
త్తమవిద్యాధర కాంతలందెగడు సి ♦ ద్ధస్త్రీలనున్ మెచ్చ దీ
రమణీరత్నము రూపసంపదల; గో ♦ త్రామధ్యమందీమె జ
న్మమునన్ ధన్యతఁగన్న భీష్మకుని నె ♦ న్నన్ శక్యమే యేరికిన్.

తే॥ గీ॥ కలికిగాదిది మదనుచే ♦ చిలుకగాని
యింతిగాదిది రతనాల ♦ బంతిగాని
కొమ్మగాదిది బంగారు ♦ బొమ్మగాని
కన్నెగాదిది క్రొమ్మావి ♦ గున్నగాని.

ఇదివరకు నే ననేక సుందరాంగులను దిలకించితినిగాని యిట్టి యంద చందంబులుగల సుందరవదనను నెందును జూచి యుండలేదు.

మ॥ విరిబోఁడిన్ శుకవాణిఁ బల్లవకరన్ ♦ విద్యుత్ప్రవాళా ధరన్
శరదిందు ప్రతిమాన బింబవదనన్ ♦ శాతోదరిన్ సుందరిన్
సరసీజాక్షి విదర్భరాజ తనయన్ ♦ సౌందర్య భూషామణిన్
బరికింపంగనె మన్మథుండు శరముల్ ♦ పైపైఁ బ్రయోగించెడున్.

(సునందుఁడు ప్రవేశించును.)

సునం—(తనలో) ఏమిదీ! ఈరోజున శ్రీకృష్ణుఁడెక్కడను మందిరంబునఁ గనుబడ లేదే! వనంబున కరుదెంచినాడని వినియుంటిని. నన్ను విడిచి యెప్పుడును వనంబునకు నొంటిగా వచ్చువాడుకాడు. నేడేల నొంటరిగవచ్చెనో తెలియ కున్నది. ఇదుగో! ఇచ్చట నేదియో దీర్ఘాలోచన సేయుచున్నాఁడు. పోయి పలుకరించెదగాక. (కృష్ణుని సమీపించి) ఏమోయి! మిత్రమా!

కృష్ణ—మిత్రమా! సునందా! వచ్చితివా!

సునం—రావలదా! ఎవరికోసం. రాకపోతే కూడుపోదూ.

కృష్ణ—ఎంతమాటఁటివి.

సునం—ఏమో! నాకుతోచినది అంటిని. సరేగాని ఈవాళ వనంబునకు నీ వొంట రిగా నరుదెంచిన కారణమేమి! ఏ గోపకాంతయైనను నివ్వనంబున కరుదెంచి కనిపెట్టికొని యుండమన్నదా యేమి! అదియే నిజమైనచో నేను వెళ్ళి పోవుదును. పానకంలో పుడకలాగున నేనెందుకు!

కృష్ణ—(నవ్వుచు) సఖుఁడా! నీ వెప్పుడును నవ్వువచ్చు మాటలనే యాడుదువే. అట్టి గుణమును నీ వెప్పుడయిన నాయొద్ద కనిపెట్టితివా!

సునం—ఇదివరకు లేకపోతే యిప్పుడట్టిగుణము పుట్టరాదూ! (చిత్రపటమునుజూచి) నీచేతిలోవున్న పట మేమిటి!

కృష్ణ—మిత్రమా! ఏమని చెప్పను. ఇయ్యది నాకు నారదమునీంద్రునిచే నొసంగఁ బడిన కుండిన పురాధీశ్వరుండైన భీష్మకనృపాలుని తనూజారత్నమగు రుక్మిణి చిత్రపటము. చూడుము. ఈకాంత సౌందర్య మెట్లున్నదో.

సునం—(చిత్రపటము జూచి) చక్కదనాని కేమీ లోటులేదు. పాలపిడతవలె మొ గమున్నది. ఆలిచిప్పలవలె కళ్ళున్నాయి. అరిటిదొప్పలవలె చెవులున్నవి. ము క్కేమిటి. ఈలాగున్నది. చాలా పెద్దదిగావున్నది. పొడుముపీల్చు నలవాటు యేమయినా వున్నదికామోను!

కృష్ణ—చాలు చాలు. నీవర్ణన! మూర్ఖునకు మల్లెపూవు నొసంగ వాఁడేదియో గావిం చినట్లుండెను.

తే॥ గీ॥ సర్వ లోకంబులను మోహ ♦ జలధియందు
ముంచఁగాశక్తి కలయట్టి ♦ ముగుదఁజూచి

యిట్టి వర్ణనసేయ నీ ◆ కెట్లు మదిని
వేడ్కయయ్యెను చెప్పుమా ◆ బేల సఖుఁడ.

సునం—నీవు నాభార్యను చూచియుండకపోవుటచే నీమెను నట్లు తలంపుమంటివి. నాభార్య సౌందర్యమున సహస్రాంశమైనను నీమెకు లేదు. అది నాకుఁ బూర్వజన్మమున జేసిన పుణ్యముచేత సంప్రాప్తమైనది. శరీరచ్ఛాయ మాత్రము చూచితివేని తప్పక మూర్ఛనందఁగలవు. పత్యమునకుఁ బనికివచ్చు నుసిరికపచ్చడి నెఱుంగుదువా! క్రొత్తదికాదు సుమా. మూడేండ్లనాటి పాతపచ్చడి. అది చూచి యిది చూడనక్కరలేదు.

కృష్ణు—సునందా! ఏల యీపరిహాస వాక్యములు. ఇదె సమయమా!

సునం—ఈ చిత్రపటము చూచినది మొదలు నీకు మారవికార మంకురించినది కాబోలు. అందుకనే యిట్లు పలుకుటయు, నాతో భాషించునప్పుడు గూడ నొకకన్నున్నర దృష్టి చిత్రపటముపై నుంచుటయుఁ గలుగుచున్నవి.

కృష్ణు—సఖా! నీయొద్ద దాపఱిక మేల!

కవిరాజవిరాజితము.

ఇదివరకే ధరణీతలమందున ◆ నిందుని భాస్యల నెందఱినో
ముదమునగాంచితి నందమునందున ◆ భూమిని; దీనికి నీడగునా
మదవతినెందును జూడగనైతిని ◆ మానిని నేనిటు జూడఁగనే
మదనుఁడుపుష్పశరంబులనిప్పుడు ◆ మానకవేయుచునుండెఁగదా.

సునం—(తనలో) అంకురించినది. (ప్రకాశముగా) ఏడీ! ఆమదనుఁ డేమూలనున్నాడు. బొత్తిగా భయములేక నిన్నిట్లుచేయుచున్నాడుగా. ఎక్కడ నున్నాడో చూపించు. నా దుడ్డుకఱ్ఱతో నెత్తిని యొకటి పెట్టుతాను.

కృష్ణ—సఖుఁడా! ఏమియును దోచకున్నదోయి. ఆ రుక్మిణీరమణి నాకన్నులను గట్టినట్లున్నది.

సునం—కృష్ణా! ఎందుకీ భ్రాంతి! ఎందఱో గోపికలుండఁగా ఇది యొకట్టి తక్కువయైనదా! వీళ్ళందఱిని కట్టఁగట్టి మింగెదవా యేమిటి! నీవైఖరి చూస్తే ఆ తీరుననే యున్నదిలే.

కృష్ణు—ఎవ్వరైనను నిక్కలికి కాలిగోరునకైనను సరిఁబోలరు.

తే॥ గీ॥ నాబలంబును శౌర్యంబు ♦ నా ధనంబు
నాదు విమలప్రతాపంబు ♦ నా సుకీర్తి
యన్నియును వ్యర్థమాచును ♦ నలరుసుమ్మి
వనితఁ గైకొనకున్నచో ♦ వరసఖుండ.

సునం—మంచిమాట చెప్పినావయ్యా! ఆ మన్మథుండు నిన్నుఁ దోలుబొమ్మవలె నాడింపుచున్నాఁడు. కృష్ణా!

చ॥ గురుల భజించి వేదముల ♦ గూఢతరార్థము సంశయంబుగా
బఱువడి నేర్వనేల; వన ♦ వాసము సేయఁగనేల; మౌనినై
తిరుగఁగనేల; నిష్ఠమెయి ♦ దేవతలన్ భజియింపనేల; న
మ్మరునిజయించినన్ వినుము ♦ మానవుఁడెంతయుధన్యుఁడయ్యెడున్.

నందపుత్రా! నీ వెందఱినో రక్కసుల జంపితివి. ఏమిలాభము. ఆ మరుని మాత్రము జయింపలేకపోయితివి.

కృష్ణ—రుక్మిణీకాంత చెంతఁ జేరినప్పుడుగాని మరుని జయింపఁజాలను. అయ్యది యొనఁగూడదేని నాపాట్లకు మితిలేక యుండును.

సునం—వాసుదేవా! ఈ రుక్మిణి యవివాహితయే కదా!

కృష్ణ—ఎంత వెఱ్ఱిమాటంటివి. వివాహమైన పరబోండ్లపై నాచిత్తంబు పాఱునా!

సునం—అట్లయినచో నించుక ప్రయత్నంబు సేయవచ్చును,

కృష్ణ—ఏమి ప్రయత్నము!

సీ॥ అలవిదర్భాపురి ♦ కరుగుదునా నేను
చంచలాక్షిని దిల ♦ కించఁగోరి
అరుగుదుగాక యా ♦ యతివ మిన్నను జూడఁ
గలుగుదునో లేదో ♦ తెలియఁజాల
రచియింతు నాకమ్మ ♦ రాజేంద్రునకుఁ గూతు
నిమ్మంచుఁ; దప్పగా ♦ నెంచునేమొ
పోసిమ్ము బలవంత ♦ మున దెత్తు నాయింతి
యది క్రౌర్యమంచును ♦ నఖిల జనులు

తే॥ గీ॥ దలతురేమొ; యేమియునుఁ జి ◆ త్తంబునందు
దోఁచకున్నది నాకెట్లు ◆ తోయజాక్షి
పొందు ప్రాప్తించు; మిగుల యా ◆ నందమందు
నెట్లు గృపఁబూని చెప్పుమో ◆ యీ! సఖుండ.

(తెరలో)

అయ్యా! వసుదేవనందనుండైన శ్రీకృష్ణుం డెచ్చట నున్నవాఁడు. (ఇంచుక యాలకించి) ఏమనుచున్నారు. ఈ పురప్రాంతోద్యానవనంబున దన నర్మసఖుండయిన సునందునితో నున్నవాఁడనియా! సరే! నేనేగి యాతని దర్శించెదను.

కృష్ణు—మిత్రమా! సునందా! నన్నరయుచు నెవ్వరో యిటు వచ్చుచున్నట్లున్నారు. పోయి కనుఁగొని రమ్ము.

సునం—మంచిది. (నిష్క్రమించి వెంటనే విష్ణుశర్మతోఁ బ్రవేశించును.)

కృష్ణు—భూసురోత్తమా! భవదీయపాద పంకేరుహంబుల కీసేవకుండు నమస్కరింపుచున్నాఁడు.

విష్ణు—దీర్ఘాయుష్మాన్ భవ!

సునం—(తనలో) రుక్మిణినిఁ జేబట్టుదువుగాక యని దీవించక యీ వెఱ్ఱిబ్రాహ్మణుఁ డిట్లు దీవించెనేల! అట్లొనర్చిన మాకృష్ణున కానందము గలిగియుండును గదా!

కృష్ణు—భూసురపుంగవా! ఇట దయసేయుము.

విష్ణు—(కూర్చుండును.)

సునం—మందిరమందుఁ గృష్ణుని దర్శించినచోఁ గూర్చుండుటకుఁ గుర్చీలు పీటలు యేమయినా యుండునుగాని యీవనములో యేముంటాయి. ఈ బాతిమీదనే కూర్చొనియున్నాఁ.

కృష్ణు—అయ్యా! భూసురపాద సందర్శనంబు సమస్తపాప విమోచనంబని పెద్దలు వక్కాణింతురు. నీ దర్శనంబున నేనిప్పుడు ధన్యుఁడనైతిని. భవదీయనివాసం బెయ్యది. ఇచ్చోటికి కరుదెంచుట కేమికారణమో కృపఁబూని సెలవిమ్ము.

విష్ణు—విదర్భ మదీయ నివాసభూమి!

కృష్ణు—ఏమీ! విదర్భయేనా భవదీయ నివాసభూమి!

తే॥ గీ॥ ఆవిదర్భ పురాధిపుం • డౌచు నలరు
భీష్మకుండు కుశలియౌచు • వెలయువాఁడె
భవ్యగుణసీమ రుక్మిణీ • భామ నేమ
మే; వచింపుమా విందు భూ • దేవమౌళి.

విష్ణు—అందఱును కుశలంబుగనే యున్నవారు.

సునం—అయ్యా! బ్రాహ్మణోత్తమా! ఆ రుక్మిణీదేవికి వివాహముసంగతి యేమయినా తలపెట్టుకొన్నారా! అది వినుటకు మా వాసుదేవుని చిత్తము తత్తరమందు చున్నది.

విష్ణు—కృష్ణా! అదియే నారాకకుఁ గారణంబు. ఇదిగో! ఈలేఖ చూచినచో సమస్తంబును దెలియఁగలదు. (అని లేఖ యిచ్చుచున్నాఁడు.)

కృష్ణు—(పుచ్చుకొని చదివి) మిత్రమా! సునందా! వింటివా! విదర్భాపురపాలకుండయిన భీష్మకుండు తన కుమారియగు రుక్మిణికి స్వయంవర మహోత్సవము గావింపఁ దలంచి నన్నును నాహ్వానించినాఁడు.

సునం—తపము పండినది. నేటి కెన్నిరోజు లున్నది.

కృష్ణు—అయిదురోజులు మాత్రమే యున్నది.

సునం—అట్లయిన నింక సందేహ మెందుకు.

కృష్ణు—(విష్ణుశర్మం జూచి) భూసురోత్తమా! స్వయంవరమున కేయేరాజుల నాహ్వానించిరి?

విష్ణు—జరాసంధ సాల్వ శిశుపాలాదిరాజుల నందఱిని నాహ్వానించిరి.

కృష్ణు—అట్లనా! సరే! నేనును వచ్చెదను. నీవు తిరిగి విదర్భ కెప్పు డరుగుదువు.

విష్ణు—మార్గాయాసంబున మిగుల నలసియున్నాఁడ. నేటి కిచ్చటనుండి తెల్లవారఝామున బయలుదేరి పోయెదను.

సునం—బ్రాహ్మణోత్తమా! నేటికి మాయింటికి భోజనంబునకు దయసేయుము.

విష్ణు—అవశ్యము.

సునం—ముందుగా నొకసంగతి నీకుఁ జెప్పవలసియున్నది. మాయింటి ఆవిడ కొద్దిగా కోపస్వభావము కలది. అది యెవ్వరికైనా చూచిన వచ్చుకోపము కాదు. జన్మతోయున్నదే. ఒక్కొక్క సమయంబులఁదు నన్ను జీపురుకట్టతో బాదుచుండును. అదిచూచి నీవేమీ జడియవద్దు.

కృష్ణ—సునందా! అందఱిదగ్గిరను నొకతీరుగనే భాషింతువుకదా. రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)

రంగము—విదర్భపుర ప్రాంతోద్యాన వనము.

(ప్రవేశము—రుక్మి, శిశుపాలుఁడు.)

రుక్మి—

ఉ॥ సందియమందఁబోకు బల ♦ శాసనవైభవ చేదిభూప! నీ
డెందమునందు నింకను; క ♦ ళిందిశ్రమంబును నందియైన; బూ
ర్ణేందునిభాస్య రుక్మిణిని ♦ నిచ్చి వివాహము జేసినీకు నా
నందముగూర్తు సత్యముగ ♦ నందఱుమెచ్చఁగ భూతలంబునన్.

శిశు—మిత్రమా! రుక్మీ! నీవుమాత్ర మాసంగతిని మఱచిపోవలదు.

తే॥ గీ॥ అరుగుదెంచుచున్నాఁడట ♦ యాదవుండు
యింతి రుక్మిణి యతని వ ♦ రించునేమొ
తగిన జాగరూకతతోడ ♦ దనరుచుండి
నా యభీష్టముదీర్పు భూ ♦ నాథ పుత్ర.

రుక్మి—కృష్ణుఁడుకాదు, ఆ జిష్ణుఁడే రానిమ్ము. ఒకవేళ రుక్మిణి యతనిని వరించి నను నందులకుఁ దగిన యంతరాయము గల్పించెదను. నా యుపాయంబు సాగదేని,

మ॥ ధరణీపాలక! సంశయింపకు భుజా ♦ దర్పంబు సొంపొంద; భా
స్వరలీలన్ యదు భర్తఁదాఁకి యనిలో ♦ బాహాబలంబార్చి; సుం
దరి నాసోదరి రుక్మిణీ యువతినిన్ ♦ దథ్యంబుగాగూర్తు నీ
కరయన్; సాల్వజరాసుతాదులు సము ♦ ద్యత్ప్రీతినిం బొందఁగన్.

[సాల్వుఁడు, జరాసంధుఁడు, దంతవక్త్రుఁడు ప్రవేశించుచున్నారు.]

జరా—మిత్రమా! సాల్వా! మన మెట్లయినను బట్టుబట్టి యీ రుక్మిణిని మన శిశుపాలునకుఁ దప్పక వివాహము జేయించవలయును.

సంత — ఇదుగో మా శిశుపాలుడు రుక్మితో నేదియో మంతనమాడు చున్నాడు.

రుక్మి — భూవల్లభా! జరాతనయా! మనవారందఱును నరుదెంచిరికదా. సరే! నే నరిగి స్వయంవర ప్రయత్నంబున నుండెద. (నిష్క్రమించును.)

జరా — శిశుపాలా! రుక్మి యేమని చెప్పుచున్నాఁడు.

శిశు — ఏమని చెప్పును. మొదటి నుంచియు రుక్మిణిని నా కొసంగుదు ననియే చెప్పుచున్నాఁడు.

జరా — ఇప్పుడు దానికి వ్యతిరేకముగా నేమయినఁ జెప్పెనా యేమి!

శిశు — అతఁడెప్పుడును నట్లుజెప్పఁడు.

"తే॥గీ॥ ఎంతశ్రమఁ జెందినైనను ♦ నింతి నీకు
నిచ్చి వైవాహికముజేసి ♦ యెగడువాఁడ
నడ్డుపడి రేని; యెవరైన ♦ నాజియందు
వారి దర్పంబు దూలింతు ♦ వరసఖుండ."

అని వక్కాణించినాఁడు. ఇందుల కాతండు తప్పువాఁడు గాఁడు.

జరా — కృష్ణుండుగూడ నీ స్వయంవరార్థము బిలువఁబడినాఁడు. అతఁడు తప్పక యరుదెంచును.

తే॥ గీ॥ అతివ రుక్మిణి హృదయంబు ♦ యతనిపైన
జిక్కియుండెననుచు వింటి ♦ నిక్కముగను
దాని భంగంబు గావింపఁ ♦ దగును మనకు
యత్న మేమైనఁ నిపుడె జే ♦ యంగవలయు.

శిశు — యత్నము సేయుట కేమున్నది.

చ॥ రణమ్మున నుగ్రసాయక ప ♦ రంపర లేయుచు ఘోరశత్రుమా
రణమును జేయఁగాఁదగిన ♦ రాజిత శౌర్యము గల్గియుండ; దు
ర్గుణుఁడయియొప్పుచున్న యల ♦ గోపకుమారుని గూర్చి యిట్లు నె
మ్మనమున సంశయింపఁగను ♦ మానవనాథ యదేలచెప్పుమా.

జరా — శిశుపాలా! సంగరము ప్రాప్తించు నేమో యని నేను సంశయించుట లేదు.

తే॥ గీ॥ కారణము గల్గకుండ సం ♦ గ్రామమిపుడు
గలుగఁ జేసినచో జనుల్ ♦ క్ష్మాతలమున
నిందఁజేయుదు రందుచే ♦ నీరజాక్షు
నెట్టులైనను వంచించి ♦ యెగడవలయు.

రణకర్మముఁగూడ కొంత విచారింపవలయునుగదా. అకారణంబుగ నాగోపాలునితోఁ గయ్యంబునకుఁ గడంగితిమేని జనంబులు మనలను నిందింతురు. ఈ కారణము చేత నేదియేని యుపాయంబు బన్నవలెను. కాని రణంబునకు జడిసి నేనిట్లు పలుకలేదు. నా శౌర్య బలపరాక్రమంబుల సంగతి నీవెఱుంగవా యేమి!

మ॥ హరుదుర్గబ్రహ్మయు దేవనాథముఖ స ♦ ర్వాశాతలాధీశ ని
ర్జరరాట్కిన్నర సిద్ధసాధ్యవరనా ♦ సత్యానిలాదిత్య కిం
పురుషుల్ కృష్ణుని పక్షమూనుచును సం ♦ పూర్ణ ప్రతాపంబుతో
సరగన్ వచ్చినగాని వెన్నిడసుమీ ♦ సంగ్రామ రంగంబునన్.

నేనెన్నడును కృష్ణుని లక్ష్యపెట్టువాడనని తలంపకుము.

శిశు—అట్లయిన మన మిప్పుడు చేయవలసిన కార్య మేమి?

జరా—అయ్యది చెప్పుటకు సాల్వుండు సమర్థుఁడు.

సాల్వ—మీరట్లంటిరి గాన చెప్పకఁ దప్పదు. ఇప్పుడు శ్రీకృష్ణుండు తప్పక యరుదెంచును. ఎట్లయిన మన మాతనినిఁ బరాభవించి స్వయంవరంబున కుండనట్లు జేయవలయును.

దంత—దాని కుపాయంబెట్లు?

సాల్వ—ఆత డేతెంచునప్పుడు మనము లేవకుండుటయు, ప్రత్యుత్థాన మొనరింపకుండుటయు, భాషింప కుండుటయు. అట్లు చేసితిమేని యాతని మనస్సునకుఁ గష్టంబుదోచి వెళ్ళిపోవును. ఆతడరిగిన తరువాత స్వయంవరము బ్రవర్తింపఁ జేయ నగును.

జరా—అవును. అట్లు చేసినచోఁ గృష్ణుఁడు చిన్నఁబోవును.

సాల్వ—అదుగో. రథ చక్రముల చప్పుడు వినవచ్చుచున్నది. స్వయంవరమున [illegible]వ్వరో రాజులు కాబోలు వచ్చుచున్నారు.

( తెరలో )

తే॥ గీ॥ కమ్మలో లిఖియించిన ♦ కరణిఁ; నా స్వ
యంవర సమయ మాసన్న ♦ మయ్యెగాన
దారకా! రథంబునుదోలు ♦ త్వరితగతిని
దిన్నగా భీష్మ కన్యపు మం ♦ దిరముఁజేర.

శిశు—ఎవ్వరో యనుకొంటిమి. మన కౌజన్మ విద్వేషియగు కృష్ణుఁడే.

సాల్వ—ఆతఁడీగారినే వచ్చును. మన మిచ్చట నుంకరాదు. (నిష్క్రమింతురు)

[ కృష్ణుఁడు, సాత్యకియు రథముతో బ్రవేశము. ]

కృష్ణు—తమ్ముఁడా! సాత్యకీ! ఇదిగో! విదర్భాపురము బ్రవేశించినాము. శిశుపాల సాల్వ జరాసంధ దంతవక్త్రులు మనకంటె ముందే యరుదెంచి యున్నారని వినియుంటిమిగదా. స్వయంవర సమయమున నీ వొక్కింత జాగరూకుఁడవై మెలంగవలయును. ఏల యనిన;

తే॥ గీ॥ అస్మదీయ నామమువిని ♦ సంతవారు
మండిపడు చుందు రెప్పుడు ♦ మనములందు
గాన వారేమికీడును ♦ గలుగజేయ
నెంచిరోయని నేసంశ ♦ యించువాఁడ.

సాత్య—

మ॥ వనజాతోద్భవ ముఖ్యసర్వసు మనో ♦ వర్గంబు లెవ్వానినిం
గనలేరాసనకాదిమౌని జనహృ ♦ త్కంజంబులంబొల్చు; నీ
కును; నెగ్గుల్ బొనరింపఁగాఁ దలచినన్ ♦ గూ్రరాత్ములా వారు నా
ఘన బాణాసన కీలికీలలను ద ♦ గ్ధంబౌదురో యగ్రజా.

కృష్ణు—తమ్ముఁడా! నీ పరాక్రమము సంగతి నే నెఱుంగుదును. ఎందుచేతనో గాని స్వయంవరము జరుగునా లేదా యను సందియము నా డెందంబునఁ గలుగు చున్నది. సరే! ఏది యెట్లుఁగానున్నదో చూతము. (రథసారధినిజూచి) దారకా! భీష్మకుని మందిరమునకే రథంబును బోనిమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

———



# వైదర్భీవిలాసము.



## చతుర్థాంకము.

[రంగము — ద్వారకాపురప్రాంతము: — నారదుండు ప్రవేశము.]

నార — (తనలో) ఎక్కడనైనను గయ్యాము జరుగకుండిన దినము నాకు శ్రీహరివాసరముపంటిది యగును. రుక్మిణికి బ్రథమమునఁ జాటింపఁబడిన స్వయంవరమహోత్సవంబునకు శిశుపాల జరాసంధసాల్వాదులు భంగము గావించుట నాకడుపు నిండుటకు వచ్చినది. ఎట్లయినను సాక్షాచ్ఛ్రీమాదేవియగు నారుక్మిణిని శ్రీకృష్ణుండే తప్పక గ్రహించును. కాని మూఢులయిన శిశుపాలాదులిట్టి యంతరాయంబు గల్పించిరి గాని మఱి యొండు గాదు. రుక్మిణీహృదయంబు వాసుదేవునియందు లగ్నమై యుండుటఁ జేసి యాతఁడున్నంతవఱకు రుక్మిణి యితరులను వరింపదని తలంచి యమ్మహాత్ముని వధించుటకు వారు సమర్థులు గాక కాలయవనుని ముకుందుని పైకి దాడి వెడల బ్రేరేపించిరి. కలహప్రియుండనైన నేనును గాలయవనునితో గృష్ణుని పైకి యుద్ధంబున కరుగుమని చెప్పి యాతని బలపరాక్రమంబుల నింమక వర్ణించినంతనే యుబ్బి యిప్పుడే మధురానగరంబును ముట్టడించినాఁడు. భగవంతుండగు వాసుదేవుం డీకాలయవనుని రాక నెఱింగి, యాతనితోఁ బోరాడుచున్న సమయంబున జరాసంధాదులు గూడ నరుదెంచినచో వీరందఱితో యుద్ధము సేయుట కష్టమని తలంచి రెండవకంటికి వానికిఁ గోచరము గాకుండ, విశ్వకర్మచే సముద్రమధ్యంబున ద్వారకాపురంబు నిర్మింపఁజేసి యిందున్న సమస్త భాగ్యంబులతో గూడ జనంబులను నచ్చటికి బంపివేసి బలరాముని వారికి సహాయం బిచ్చి పంపి తానొంటిగ నిచ్చటనుండి కాలయవనుని నెదుర్కొనఁ దలంచుచుండె. ఆహా! భగవంతుండగు నందనందనుని మాయ నెవ్వరును దెలియఁజాలరు గదా. సకలసృష్టిస్థితిలయంబులకును గారణభూతుండైన యమ్మహాత్మునకుఁ గాలయవనునితో రణంబొనర్చుటకు వస్త్రంబులును వాహనంబులును సైన్యంబులును గావలయునా? అక్షీణ రూక్షేక్షణ శ్రీ

క్షణంబులచేతనే ప్రతిపక్ష సైన్యంబును భస్మము సేయునుగదా. (తెరలో ధ్వని విని) ఏదియో! కోలాహలము వినవచ్చుచున్నది. ఏమైయుండును. (పరికించి) కాలయవనుని సేనలయొక్క యార్భాటంబులు. ఎన్ని యక్షౌహిణీల సైన్యంబుతో నీయవనుండు పురంబు ముట్టడించినాడు. ఈతనిపైకి శ్రీకృష్ణుండు సేనాసమన్వితుండై వచ్చునని తలంచుచున్నాడుగాని, యాతఁడొనర్చిన మాయమాత్రమెఱుంగలేకున్నాడు. కానిమ్ము! ఈసారి జరాసంధాదులకు సంపూర్ణమైన పరాభవము జరుగును. యవనునకు గోపాలునకు జరుగు సమరప్రకారమును పైపైనుండి వీక్షింపుచుండెదను.

(నిష్క్రమించును.)

(ఖడ్గధరుండై కాలయవనుఁడు ప్రవేశించును.)

కాల—(తనలో) ఏమిదీ! ఈపురంబును ముట్టడించి యెన్నియో దినంబులయినది ఇంతవరకును నన్నెదురించుట కెవ్వరును రాకయుండుటయేగాక యొక్కఁడైనను కంటికి గనిపించుటలేదు. ఇదయంతయు చిత్రముగనున్నది.

తే॥ గీ॥ కాలయవనుండు ఘోరసం ◈ గ్రామకేళి
మాధవునితోడ సలుపంగ ◈ మదిఁదలంచి
యరుగుదెంచె నటంచును ◈ నఖిల జనులు
పాఱిపోయిరి కాబోలు ◈ భయముచేత.

అట్లుగానిచో నిందులకు గారణ మేమైయుండును. నిజముగా నాకృష్ణుండుగూడ నాకు భీతిల్లి డాగియుండెనని తోచుచున్నది. (నలుదిక్కుల గలయంజూచి) పురంబును ముట్టడించిన యిన్నిదినంబుల కొక్కనయుండు నాకంటి కగుపించినాఁడు. ఆతండిట్లే వచ్చుచున్నాఁడు. ఏమి యీతని రూపును తేజంబును గన్నులను మిఱుమిట్లు గొల్పుచున్నవి.

సీ॥ శంఖచక్ర గదాది ◈ సాధనంబులవాడు
నాజానుబాహు ద్వ ◈ యంబువాఁడు
నీలమేఘచ్ఛాయ ◈ నేలు దేహమువాడు
రాజిల్లు పీతాంబ ◈ రంబువాఁడు

వక్షస్థలంబున ♦ వరలక్ష్మిఁ గలవాఁడు
కంజాతములఁబోలు ♦ కనులవాఁడు
చండమార్తాండ తే ♦ జము హసించెడువాఁడు
కౌస్తుభ హారంబు ♦ గలుగువాఁడు

తే॥ గీ॥ లలిత కుండల దీప్తినిఁ ♦ బొలుచువాఁడు
కాంచన కిరీటంబునఁ ♦ గ్రాలువాఁడు
నగు మహాపురుషు డొకండు ♦ నరుగుదెంచు
చుండెఁ; శీఘ్ర గమనమునఁ ♦ జోద్యముగను.

ఈతని రూపురేఖావిలాసంబులు జూడఁగా నారదుండు చెప్పిన శ్రీకృష్ణుం డితఁడేయని తోచుచున్నది. (ఆలోచించి) అఘను సందియ మేమియును లేదు. కాని,

తే॥ గీ॥ తన కరంబున బాణముల్ ♦ దాల్పకుండ
వెంట సైన్యంబు లేకుండ ♦ నొంటిగాను
వచ్చుచుండెను నిప్డు భా ♦ వమున నాదు
శరణ మందుట కంచును ♦ జాల దలతు.

కాకున్నచో నీతఁ డొంటరిగా నరుగుదెంచుట కేమి కారణము. అదుగో! ఆతఁడు నిర్భయముగా నన్ను సమీపించుచున్నాఁడు.

(కృష్ణుఁడు ప్రవేశించును.)

కృష్ణు—(ప్రవేశించి తనలో) ఈ యవనుండు జరాసంధాదుల ప్రేరేపణంబున నాపైకి దాడివెడలినాఁడు. అందుకు నేనును దగిన మాయయే సల్పితిని. ద్వారకా నగరంబున కండఅను బలరాముని సహాయం బిచ్చి పంపివేసితిని. నేనొంటిగ నరుదెంచుట జూచి వీఁడు నిశ్చయముగా నేను భయమందితి నని తలంచును. నేను నట్లే నటింపుచు వీనిని గడుదవ్వుగఁ దీసికొనిపోయి యచ్చట దుదముట్టించెద గాక. (భీతిల్లినట్లు నటింపుచున్నాఁడు.)

కా—(కృష్ణునిఁ జూచి) ఓయీ! నీవేక బోలు కృష్ణుఁడవు.

కృష్ణు—అవును. అయిననేమి!

'ల—

శా॥ ఎన్నాళ్ళో గతియించె నీనగరమున్ • నేఁబట్టి యిన్నాళ్ళకున్
గన్నారన్ నిను గాంచగంటినిపుడో • కంజాక్ష యీరీతినిన్
జన్నే నీకు భయంబుఁజెంద; రణభీ • తుంగోరి యిచ్చోటికిన్
సన్నాహంబున వచ్చినాడను భవ • త్శౌర్యంబుఁ జూపింపుమా॥

తే॥ గీ॥ శౌర్యమూర్తుల దైత్యులఁ • జంపితివఁట
యాజరాసుతుతోడ బో • రాడితివఁట
క్రూరతనమున గంసునిఁ • గూల్చితివఁట
యేది చూచెద నీబలం • బింత యిపుడు.

కాలయవనుండు మాటలతో జనువాడుకాడని ముందుగా నెఱుంగుము.

కృష్ణ—ఓయీ! యవనా! ఈ ప్రగల్భవాక్యంబుల కేమి లెమ్ము.

మ॥ చెనటీ! యేటికిఁ బ్రేలెదీకరణి నా • జిక్షోణిలో నాజరా
తనయుండంతటివాఁడె చాలకమహా • ధైర్యంబుగోల్పోవుచున్
దనదారింబడి చేరెనా మగధ; నీ • దర్పంబు నాముందఱన్
గనఁజేయన్ దలపోయుచుంటివిగదా • కాలంబు ప్రాప్తించుటన్.

ాల—

మ॥ ధనువో ఖడ్గమొ లేనిచో గదయొ చే • తందాల్చి యిప్పట్టునన్
రణరంగంబున నిల్చినీదు భుజద • ర్పంబెల్ల జూపించి మిం
చిన శౌర్యంబున నన్ను గెల్చి విజయ • శ్రీగాంచి యిట్లాడినన్
జను; గాకన్; విను వీరవాక్యములకున్ • సంతోష మెట్లయ్యెడున్.

కృష్ణా! ఆయుధసమేతుండవై రణరంగమునకు వచ్చి నాతో నొక్కించుకకాలము పోరుసలుపుము. నీనా బలపరాక్రమంబులు దెలియును. వీరవాక్యంబులతో నేమి ప్రయోజనంబున్నది.

కృష్ణు—యవనా! నిన్ను వధింపుటకు నాయాయుధంబులు గావలయునా?

సీ. బ్రహ్మాండములనన్ని ♦ బంతులరీతిగా
నెగయంగవైతును ♦ నింతలోన
సప్తసముద్రముల్ ♦ చక్కఁగాఁగ్రొందు
పుడిసింటఁబట్టియా ♦ పోశనంబు
సకలపర్వతములా ♦ సముదయంబునుముగ్గు
జేసిచల్లుదును నీ ♦ క్షితితలమున
అట్టహాసముజేసి ♦ యామృత్యుదేవత
దంష్ట్రలు బెఱికెద ♦ దర్పమునను
తే. గీ. మఱియు నెన్నేనికార్యముల్ ♦ మహితలీల
జేసి త్రిభువనఖ్యాతితోఁ ♦ జెలఁగఁగలను
నట్టి నీవేడ నాతోడ ♦ నాజియేడ
సలుపుటేడ నవ్వుదురఁ జా ♦ ల్చాలుయవన.

కాల—మాధవా! నీప్రగల్భంబు లింకఁ జాలింపుము.

మ. బలిదండన్ వసియింపనేగిన; నభో ♦ భాగంబునన్ డాగినన్
జలధిన్ జొచ్చిన; బ్రహ్మాణుండవయినన్ ♦ సౌకర్యవేషంబు బూని
ననున్ వంచనసేయఁగాఁ దలఁచినన్ ♦ నిక్కంబుగానేఁడునిన్
బలిమిన్ దుంచెద సంగరంబునను మ ♦ ద్బాహా బలప్రౌఢిమన్॥

నీ వెన్నటికిని జిక్కకయుందువట. అట్టి నిన్నిప్పుడు నేను బట్టుకొందును. చూడుము. (కృష్ణుని బట్టుకొనఁబోవును.)

కృష్ణు—(యవనునకు జిక్కక) తొందరపడకుము. రమ్ము. నన్ను బట్టుకొందువుగాక.
(యవనునకు జిక్కక పరువెత్తును.)

కాల—(శరంబుఁ బ్రయోగించి) ఏమి! యిది కడు వింతగానున్నది. నాశరంబు లీ నికి దాకకున్నవి. వీనిని నేను సమీపించితినిగదా యని తలంచి పట్టుకొనబో

నన్ను దగ్గఱకు రానిచ్చి కప్పించి లంఘించుచున్నాఁడు. ఈతని పరువును గని కొన నలవికాదని తలంచి వినువజెంది యింటినేని నన్ను సమీపించుచున్నాఁడు. వీఁడు నడుచునప్పుడు దారి కడ్డంబుగా బోయితినేని యేమూలనుండియో తప్పించుకొనిపోవుచున్నాఁడు. వల్మీకంబులు గాని, తరులు గాని కొండలుగాని దారి కడ్డంబైనను లక్ష్యపెట్టకున్నాఁడు. (కృష్ణునివెంటఁ బరువెత్తును.)

కృష్ణ—ఇదిగో నిన్ను సమీపించితిని బట్టుకొనుము.

కాల—

తే॥ గీ॥ పగఱకీరీతి భయమందు ♦ వాఁడవీవు
యలజరాసుతుతోడఁ గం ♦ సావనీశు
తోడ; నెట్లురణముజేసి ♦ నాఁడవో; యె
ఱుఁగరాదు; కాకున్నఁ బా ♦ ఱంగదగునె.

కృష్ణ—ఓరీ! యవనా! నాయొద్దనున్న విశేషమే యియ్యది-

తే॥ గీ॥ పట్టగల్గితివేనినన్ ♦ బట్టుమిపుడు
చేతగాకున్న నీపురి ♦ జేరుమికను
బలముశౌర్యంబు గలవాఁడ ♦ వయ్యునిట్లు
కాఱులేటికిఁబ్రేలెదు ♦ కలుషచరిత.

కాల—(కోపముతో) కృష్ణా! నిన్ను బట్టితీరెదను. ఇదిగో చిక్కినావు. (అని సమీపించగా కృష్ణుండు పాఱిపోవును.)

కృష్ణ—నన్ను బట్టుటకు నీతరముగాదు.

కాల—(తనలో) అహా! వీఁడు నన్నుఁ గ్రూరమృగ సంతానంబున కాకరంబైన మహారణ్యంబునకు దోడ్కొనివచ్చినాఁడు

[ తెరలేచును—రంగము—శైలగుహ ]

(ముచికుందుఁడు నిద్రించుచుండును.)

కృష్ణ—(మాయమగును.)

కాల—(గుహంజూచి) ఈతఁడు నన్నింతదూరము దీసికొనివచ్చి యీ శైలగుహం బ్రి

వేశించినాఁడు. ఇంక నీతఁడేమార్గమునఁ దప్పించుకొని పోఁగలఁడు. (ఇంచుక నడచి గుహాయందు నిద్రించుచున్న ముచికుందునిఁ జూచి) ఓరీ! కృష్ణా!

ఉ॥ ఎంతటిమాయకాడవో యి ♦ హీనపరాక్రమ విక్రమంబునన్
బంతముతోడనన్నును ర ♦ ణంబున దాకగ శక్తి లేక; దు
ర్దాంత దురంతఘోరమృగ ♦ రాజికినాకరమైన యీవన
ప్రాంతముఁజేర్చి కొండగుహఁ ♦ బండితివే! మది లజ్జవీడుచున్.

ఓయీ! యేమియు తెలియంగనివాని చందమున నిద్దురబోవుచున్నచో నూరకొందునని తలంచితివికాబోలు. మున్ను నీవెవ్వరికిని బట్టుబడవని నారదుండు నాతో జెప్పియున్నాఁడు; కాని నీవు నాకు జిక్కితివి. నన్నువంచించి యీ శైల గుహం బ్రవేశించి నిద్రించున్నవాని తెఱంగున నటించు నిన్ను దీర్ఘనిద్ర బొందించెద. (ముచికుందునిఁ దన్నుచున్నాఁడు.)

ముచి—(కన్నులు తెఱచిచూచి) ఓరీ! దుర్మతీ! యెవ్వఁడవురా నీవు!

తే॥ గీ॥ యోగనిద్రాపరవశత ♦ నున్ననన్ను
గారణములేక దన్నుదే ♦ కలుషచరిత
యస్మదీయోగ్రదృష్టి మ ♦ హాగ్ని కీల
లందు భస్మమౌదువుగాక ♦ నవనియందుఁ.

కాల—(దగ్ధుఁడగుచున్నాఁడు.)

[ ముచికుందునకు శ్రీకృష్ణుండు సాక్షాత్కరించును. ]

ముచి—(కృష్ణునిఁజూచి తనలో) ఎవ్వఁడో యొకఁడు నన్ను దన్ని భస్మమైనాఁడు. ఇప్పుఁడీమహానుభావుం డెవ్వరో నాకు సాక్షాత్కరించినాఁడు. వైజయంతీ మాలయు, పీతాంబరంబును, మకరకుండల కాంతియు, కౌస్తుభహారంబును జూడగా నన్ను రక్షింప నరుదెంచిన శ్రీమన్నారాయణుండని తలంచెదను. (ప్రకాశముగాఁ గృష్ణునిఁ జూచి) మహాత్మా! పరమపావనమూర్తివై చెలంగుచున్న నీ పాదారవిందంబులకు నమస్కరింపుచున్నాను.

మ॥ కమలాకాంతుఁడవో! ప్రభాకరుఁడవో ♦ కాత్యాయనీభర్తవో
యమరేంద్రుండవా! భారతీధవుఁడవో! ♦ యజ్ఞారివో! నీదుతే
జమునిండెన్ దిశలెల్ల; నెవ్వఁడవిటుల్ ♦ జన్దెరగా నేల సా
యములే కెవ్వరునోంటివాఁడను! మహా ♦ త్మా! చెప్పుమీ వేడెదన్.

నీ వెవ్వరవో యొక్క మహానుభావుండవని నీ తేజమే చెప్పుచున్నది. ఇయ్యరణ్యంబు క్రూరమృగసంతాన నివాసంబును, కఠినపాషాణ కంటకోపేతంబునునై యున్నది. కమలపత్రంబుల బోలియున్న నీచరణంబు లిట్టినేలపై మోపుటం జేసి మిక్కిలి కందియున్నవిగదా.

తే॥ గీ॥ యోగనిద్రావశుండనై ♦ యున్న నన్ను
దన్ని యెవ్వఁడో యొక్కఁడు ♦ దగ్ధుఁడయ్యె
నంత శ్రీరమణాకృతి ♦ నందు నిన్నుఁ
గాంచఁగల్గితి గన్నుల ♦ కలిమి దీర.

నే నిక్ష్వాకువంశ సంభవుండను. మాంధాతృ తనయుండ. ముచికుందాభిధానుండ. నిన్ను దర్శించినంతనే చిత్తంబున నదియొక తీవ్రభక్తి జనించి నీసేవకై నా చిత్తంబు తత్తరపడుచున్నది. ఓ పుణ్యపురుషా! నీ కులగోత్ర నామంబు లెఱుంగుట కష్టుండనేని కృపఁబూని వచించి నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

కృష్ణు—ముచికుందా! దేవతాప్రార్థితుండనై ధరాభారంబు నాపఁదలంచి యదుకులంబున వసుదేవునకుఁ దనయుండనై శ్రీకృష్ణుండన రాజిల్లుచుంటిని. లోకకంటకుండయిన కంసుని మొదలగు ముక్కడిరక్కసుల నుక్కడగించితిని. ఇంకను ఖలుల శిక్షింపవలసియున్నది. ఇప్పుడు నీచే దగ్ధమైనవాఁడు కాలయవనుండు.

ముచి—

శా॥ నీ పీయూదవ వంశమందు సురా ♦ నీకంబునుం దుఃప్రింపగా
నీవిశ్వంభర బుట్టువాఁడవని మా ♦ నిందుఁ బ్రెల్ వచింపంగ మున్
నేర్చింటిన్ నినుగంటి నేటికి రమా ♦ నేతా! దయాదాత! నీ
సేవాసక్తి నొసంగుమో యదుకుల ♦ క్షీరాబ్ధి చంద్రోదయా!

(నమస్కరింపుచున్నాఁడు.)

కృష్ణు—నృపాలా! నీ యోగనిద్రకు గారణంబు నాకుఁ దెలియును. నీవు ముందు జన్మంబునఁ గాని నాసన్నిధిని జేరఁజాలవు. నీవిప్పుడే యిచ్చోటువాసి బదరికావనంబున కరిగి యచ్చట తపోనిష్ఠుండవై యుండుము.

ముచి—దేవా! ధన్యుఁడనైతిని. ఇంక నాకనుజ్ఞ నొసంగుము.

కృష్ణు—మంచిది. (అంతర్ధానము నొందును.)

ముచి—భగవత్కటాక్షమున నేను కృతార్థుఁడనైతిని. వాసుదేవునియాజ్ఞ ననుసరించి బదరికావనంబును జేరి యచ్చట తపోనిష్ఠుండనై యుండెద.

(నిష్క్రమించును.)

[రంగము—కుండినపురంబున నుద్యానవనము.]

(రుక్మియు, రుక్మిణియుఁ బ్రవేశము.)

రుక్మిణి—అన్నయ్యా! నాకుఁ జింతగూర్చుట తగదు. నేను నీకుఁ బగదాననుగాను.

రుక్మి—అమ్మాయీ! నేను నీశ్రేయంబు గోరియే చెప్పుచుంటిని. నాపలుకు లాలించి శిశుపాలునిఁ బెండ్లియాడ సమ్మతింపుము.

రుక్మిణి—సోదరా! నీకీ పట్టుదలయేల. ప్రాణంబులనైనను విడిచెదనుగాని నే నాతనిని వరింపను. నామానసము మాధవునిపై జిక్కియున్నది. సంపదలయందుగాని, సౌందర్యంబునందుగాని, కులీనత్వమునందుగాని, ప్రవర్తనంబునందుగాని యీతని కాలిగోరునకైనను తక్కినరాజులు సమానులుగారునుమా!

రుక్మి—ఆతనినిగూర్చి నీవె వినుతింపవలెనుగాని మఱెవ్వరును నిట్లు పొగడరు.

సీ॥ కట్టుపుట్టముజూడ ♦ పట్టుపుట్టమొకదా
యతనిభాగ్యమునింక ♦ యడుగనేల
నీలమేఘుచ్ఛాయ ♦ బోలుదేహమె తెల్పు
నతనిసౌందర్యంబు ♦ నడుగనేల
జననియు జనకుండు ♦ గనజాలమెవ్వరో
యాతనికులీనత్వ ♦ మడుగనేల
వెంటనుండెడివారు ♦ పేదగొల్లలు
నతనిప్రవర్తనం ♦ బడుగనేల

తే॥ గీ॥ యతనిచారిత్రమెల్ల హ ♦ స్తామలకమె
చూచుచుండినవారికి ♦ శోభనాంగి
నిన్నగాకను మొన్నటి ♦ కన్నెవీవు
యాదవుని నిజచారిత్ర ♦ మరయఁగలవె.

రుక్మిణి—అన్నయ్యా! తదీయ సామర్థ్యంబును, మహాత్మ్యంబును నీ వెఱుంగఁజాలవు.

తే॥ గీ॥ సద్గుణుండు, నఖిలలోక ♦ చక్రవర్తి
విశ్వమయుఁడును; విజ్ఞాన ♦ వేత్త; రూప
జితమదనుడు; నా యదుకుల ♦ క్షీరచంద్రు
వాసుదేవుని నిందింప ♦ భావ్యమగునె.

రుక్మి—అతనిని వర్ణించుటకు నీ కుక్షియందుఁ బదములు చాలకయున్నవని తోచు చున్నది.

సీ॥ గుణహీను డనిశ్రుతుల్ ♦ ఘోషింపుచుండ స
ద్గుణమూర్తి యనిచెప్ప ♦ కొదవగాదె
నిర్వికారుండని ♦ నిఖిల మునులుదెల్ప
భువనేశు డనుమాట ♦ బొంకుగాదె
యతిసూక్ష్మ రూపియై ♦ యలరారు వానిని
విశ్వమయుఁడనుట ♦ వెఱ్ఱిగాదె
పెక్కు రూపములచే ♦ విలసిల్లు వానిని
రూపవంతుడనుట ♦ రోతగాదె

తే॥ గీ॥ కులము గోత్రము లేకను ♦ జెలగువాని
జ్ఞానియంచును బల్కుట ♦ మంచిగాదె
యెవ్వరికి దెలియదు యాద ♦ వేంద్రు చిత్ర
చరితమీవు చెప్పవలెనా! ♦ సారసాక్షి.

అతండు కృష్ణమూర్తి యగాడు నీ వెట్టిభ్రమను మానుము. అతఁడే లోకరక్షకుండై
నచో నింక నడుగవలయునా!

సీ॥ యశ్వమొక్కటియైన ♦ యమరకున్న దె మొక్క
గ్రద్దపై నేల యె ♦ క్కంగవలయు
పరిపాలనము సేయ ♦ ధరణి లేకున్న దే
యుదధిమధ్యము నేల ♦ యుండవలయు
పరిచర్యలను సేయ ♦ సురలు లేకుండిరే
గోపాలకుల యేల ♦ గొలువవలయు
కలవరమ్యో నేమణి ♦ యటుతదాల్పగ; నేల
బండిగుర్విందదా ♦ ల్పంగవలయు

రుక్మిణి—

తే॥ గీ॥ చాలు మతియేమి కావలె ♦ జన్మమంది
యందుకు ఫలంబు; గోపాలు ♦ నిందజేసి
ఘోరనరకంబునందున ♦ గూలు టేయ
టంచు నీమదిలోన భా ♦ వించినావె.

అగ్రజా! అతనిని నిందించి పాపంబు గట్టుకొనకుము. నీ కిష్టమున్నదా నాయందుఁ గృపవహించి యాతనికి నన్నిచ్చి వివాహము సేయుము. లేదేని యూరకొనుము. నాకర్మగతి యెట్లున్న నట్లగును.

రుక్మి—అంతియేగాని నీవు శిశుపాలుని పరిణయంబాడవా!

రుక్మిణి—ఆసంగతి నిక దలపెట్టకుము.

రుక్మి—నీపంతమే నెగ్గునో నాపంతమే నెగ్గునో చూచెదను గాక.

రుక్మిణి—ఇందు పంతమున కేమున్నది. శ్రీకృష్ణుని జెట్టబట్టజాలక యుంటినేని ప్రాణంబులనైన విడిచెదను. నీ వంటివిగాన చెప్పవలసివచ్చినది. శ్రీకృష్ణుని వధించుటకు జరాసంధ శిశుపాలాదులు కాలయవనుని బంపిరిగదా. వాడేమయ్యెను. జరాసంధుండు మధుర కగ్గి దరికొల్పి యిప్పటికి బలరామకృష్ణులు దగ్ధులయి

 

రని సంతసించెను. కాని భగవంతుండైన వాసుదేవునిపట్ల జేయు దుష్ప్రయ త్నంబులన్నియు వ్యర్థంబులగును.

రుక్మి—కానిమ్ము చూచెదవుగాక ! (నిష్క్రమించును.)

రుక్మిణి—(స్వగతము) అక్కటా ! నాసోదరుండగు రుక్మి తాఁబట్టిన పట్టును విడువక యున్నాఁడు. ఇప్పుడు నే నేమిచేయుదును. ఎవ్వరితో మొఱబెట్టుకొందును. కన్నతండ్రిగూడ సోదరుని యాజ్ఞకు బద్ధుఁడైయుండెనే. (ఎదుటజూచి ప్రకాశముగా) విమలా ! విమలా ! ఏమే యెంత పిలిచినను బలుకవు.

విమల—(ప్రవేశించి) అమ్మా ! ఏమిసెలవు.

రుక్మిణి—అయ్యో !

మ॥ హరుసేవించుట వ్యర్థమయ్యెనుచెలీ ♦ యావాసుదేవుండు స
త్కరుణన్ జిత్తమునందుఁ బూనుచుననున్ ♦ గాపాడరాడయ్యె; సో
దరుఁడున్ నన్ శిశుపాలుకీయొసఁగి యు ♦ ద్వాహంబు గావింతునం
చరయన్ ఘోరప్రతిజ్ఞదాల్చె నికనే ♦ లా ! ప్రాణముల్ వీడెదన్.

విమ—రుక్మి తన పట్టును విడువలేదా !

రుక్మిణి—ఏల విడుచును. చెలీ ! ఇంక నేను చింతించినందువలనఁ బ్రయోజనము లేదు. ఆ కృష్ణునకు భార్యనై బ్రతుకు భాగ్యంబు నాకు లేదు. కావున నా నందనందనుని చరణారవిందంబులను డెందంబున స్మరింపుచు బ్రాణంబులు విడిచెదను. (కన్నీరు విడుచును.)

విమ—అమ్మా ! చింతింపకుము. చింతించినందువలన లాభములేదు. నారదుండు నిన్ను దప్పక కృష్ణుండు గైకొనునని చెప్పినాఁడు. అతని వాక్యంబులు రిత్త యగునా !

రుక్మిణి—అక్కటా ! ఇది యేమి యాస !

మ॥ విమలా! ధాతలిఖించెజావుమనుచున్ ♦ విజ్ఞానియామౌని వా
క్యములున్ గల్లలెయయ్యె; ఘోరతపముల్ ♦ గావించియున్ సన్మని
ప్రముఖుల్ జూడఁగలేని భక్తవరదున్ ♦ బద్మాక్షుగోవిందు; నా
గమువేదున్ బతిగాఁగఁ జేకొనఁగ శ ♦ క్యంబౌనె యోచింపఁగన్.

కావున నెవ్వరికిని గష్టము లేకుండ జీవంబుల విడుచుటయే శ్రేయము. మాయన్న మతమును ద్రిప్పుట కెవ్వరు సమర్థులుగారు. విమలా! నీవు నా స్నేహంబును మఱచిపొమ్ము. పూజ్యురాలగు మాతల్లికడ కరిగి మీ పుత్త్రికయగు రుక్మిణి యిట్టి కారణంబునఁ బ్రాణంబుల విడిచెనని చెప్పి నామీద ప్రేమను త్యజింపుమనుము. ఇంక నాకు బ్రాణంబులఁ బాయుటకు సెలవొసంగుము.

విమ—(తనలో దైవము నుద్దేశించి) భక్తరక్షణ పరాయణా! వాసుదేవా! నీ పాదారవింద సేవయే నిరంతరంబును సేయుచు, నిన్నే దైవముగా భావింపుచు, నిన్నే భర్తగా గైకొనదలంచియున్న మా చెలియగు రుక్మిణికిట్టి కష్టము గూర్తువా (ప్రకాశముగా) చెలీ! రుక్మిణీ! నిరంతరమును మాకుఁ దోడు నీడవలె జరింపుచున్న నీవు ప్రాణంబుల విడిచినచో మేము మాత్రము జీవింపఁగలమా.

రుక్మిణి—మీరిట్లు జేయవలసిన యవసరం బేమి యున్నది.

విమ—నీతో నిరంతరంబును నుండవలయునను నభిలాషయే కారణము.

రుక్మిణి—మీతో గలసి మెలసి యుండు భాగ్యము నాకున్నచో గృష్ణుండే నాకు వరుండై యుండునుగదా.

విమ—ఇప్పుడు మించిన దేమియు లేదు. ఆతండే నీకు వరుండగును.

రుక్మిణి—ముందు జన్మమునకా!

విమ—కాదు. ఈ జన్మమునకే.

రుక్మిణి—అంతటి భాగ్యము నేను నోచికొని యుంటినా.

విమ—తప్పక.

రుక్మిణి—అది యెట్లు.

విమ—నా వాక్యంబులు సావధానమతివై యాలింపుము. ఎవ్వరినైనను శ్రీ కృష్ణుని సన్నిధికి నీయభీష్టము దెలుప బుత్తెంపుము

రుక్మిణి—ఇది యెవ్వరైనను విన్న బరిహసింపరా!

విమ—ఎంతమాత్రమును బరిహసింపరు.

రుక్మిణి—వాసుదేవుండు నా సందేశంబును వినునా.

విమ—వినుటయేగాక నిన్ను జేకొనుటకు సత్వరముగ వచ్చును.

రుక్మిణి—విమలా! నాకేదియో యుపాయంబును జెప్పుచు బోవుచున్న నా ప్రాణంబులను మరల శరీరంబునఁ బ్రవేశపెట్టుచున్నావు. నాయెడ దయాంతరంగుండై నా సందేశంబును గొనిపోయి నా దీనస్థితిని శ్రీకృష్ణునకు దెలిపి యాతని దోడి తెచ్చి నా ప్రాణంబులు నిలుపు పుణ్యాత్ము డెవ్వఁడు దొరకును.

విమ—ఆ విషయమై సందియమంద నవసరములేదు. మన యగ్నిద్యోతనుడీ కార్యము నిర్వహించును.

రుక్మిణి—అట్లయిన నాతని నిటకు దోడ్కొనిరమ్ము. నే నాతనిని బ్రార్థించెదను.

విమ—(నిష్క్రమించును)

రుక్మిణి—(తనలో) ఈ విమల వాక్యంబులు నా హృదయంబున మరల నాసను బుట్టించుచున్నవి. అగ్నిద్యోతనుఁడు నా సందేశంబును గొనిపోయినచో గృష్ణుఁడది విని నన్ను గైకొనుటకు దప్పక నిచ్చట కరుదెంచునని యాశ కలుగుచున్నది. (ఎదుటఁ జూచి) అదుగో! విమల యగ్నిద్యోతనుని దోడ్కొని వచ్చుచున్నది.

[విమల అగ్నిద్యోతనునితోఁ బ్రవేశించును.]

అగ్ని—(తనలో) ఈవేళ నాపుణ్యము పండినది. యేదియో యవసరమైన కార్యముండుటచేత నే రుక్మిణి నన్ను బిలిపించినది. ఈమె దయ వచ్చినది. మా యింటినిండా మాడలు, వరహాలు, మొహరీలు, కాసులు, అరకాసులు, రూపాయలు, అర్థ రూపాయలు, పావలాలు, బేడలు, అణాలు, అర్ధణాలు, కానులు యేగానులు, దమ్మిడీలు, కుప్ప కుప్పలుగా బడి యుండును.

(రుక్మిణిని సమీపించును.)

రుక్మిణి—(భూసురుని జూచి) భూసురోత్తమా! నా నమస్కారముల గైకొనుము.

అగ్ని—శీఘ్రమేవ కల్యాణ సిద్ధిరస్తు.

విమ—అయ్యా! ఆ పీఠంబున గూర్చుండుము.

(బ్రాహ్మణుఁ డాసీనుఁడగును.)

రుక్మిణి—ధరామరపుంగవా! నాయందుఁ గృపాంతరంగుండవై యొక్కకార్యము నెఱవేర్చి నా ప్రాణంబులు నీవు నిలబెట్టవలెను. అయ్యది నీవు తప్పక చేయుదువని తలంచి నిన్ను రప్పించితిని.

అగ్ని—అమ్మా! మాపూర్వులు అంతకంటె పూర్వులు మీ సంస్థానమువారి యుప్పుపులుసు దినియే జీవించిరి. నేనును నట్లే కాలము గడుపుచుంటిని. కావున నెట్టి దుర్ఘటకార్యము నేయుమని నీవు నియోగించినను దప్పక జేయుదును. సంశయింపక చెప్పుము.

రుక్మిణి—దేవా! బాల్యంబాదిగ నా హృదయము వసుదేవ నందనుండైన శ్రీకృష్ణుని యందు జిక్కియున్నది. అతనిని దప్ప నన్యుల వరింపనొల్లనని దీక్ష వహించి యున్నదాన. అట్టి యెడల దీనికి భంగంబుగావించి నా యగ్రజుండగు

రుక్మి నన్ను శిశుపాలున కొసంగఁదలంచి యున్నవాఁడు. కావున నీవు ద్వారకానగరంబున కరిగి భగవంతుండైన వాసుదేవునింగాంచి యీ విషయంబాతనికి విన్నవించి యాతని నిచ్చోటికి దోడితెచ్చు భారము నీ భుజస్కంధమునందు వహింపవలయును.

మ॥ ధరణీదేవ! మదీయవాక్యములఁ జి ♦ త్తంబందునూహించి భా
స్వర పీతాంబరధారియైతనరు కృ ♦ ష్ణస్వామినింగాంచి సాం
పరయన్ విన్నపమంతయున్ దెలిపి యు ♦ ద్యత్ప్రీతిపుట్టించి స
త్వరగాఁదోడ్కొనిరమ్ము నీవిమల పా ♦ దద్వంద్వమున్ మ్రొక్కెదన్.

భూసురోత్తమా! నీకంటె నా కాప్తులెవ్వరును లేరు. నీవా శ్రీకృష్ణుని దోడ్కొని వచ్చి నా ప్రాణంబుల నిలబెట్టుము.

అగ్ని—(తనలో) ఆహా! భగవంతుండైన వాసుదేవుని దర్శించు భాగ్యము నాకు లభించునుగదా. ఈ సందేశము గొనిపోయితినేని యాతండు నన్ను సత్కరించును. ఆతనిని నేను దోడితెచ్చితినేని యీమె నాకు గావలసిన ధనం బిచ్చును. ఉభయ పక్షములవారి వలనను లాభంబు గలుగును. (ప్రకాశముగా) అమ్మా! రుక్మిణీ! ఈ స్వల్పకార్యమునకేనా నీవు నన్నింతగా బ్రతిమాలుకొనుచున్నావు. నేను నిమిషములో ద్వారకాపురి కరిగి యా శ్రీకృష్ణుని సందర్శించి నీ సందేశము చెప్పి యాతనిని దోడితెచ్చెదను. నామాటలు విని యాతడు నిన్ను దప్పక పెండ్లియాడును. బ్రాహ్మణుఁడను. తపశ్శాలిని. నామాట లాతడు కాదనఁజాలడు.

శా॥ ఆనందాంబుధి నోలలాడుచు మురి ♦ ధ్యానైకశీలుండనై
మానుల్ జెప్పెడి ధర్మశాస్త్రముల స ♦ న్మానింపుచున్ సద్గురున్
నే నెల్లప్పుడు భక్తితోఁగొలుతు నే ♦ నిన్ దప్పకన్ విన్ము కాం
తా! నామాటల నాలకించి నిను దై ♦ త్యధ్వంసి పెండ్లాడుతన్.

అది యంతయు నేల. ఆతనిని దోడితెచ్చు భారము నాయది. నీవాతనికి జెప్పవలసిన సందేశ మేదియో యది చెప్పుము.

రుక్మిణి—భూసురోత్తమా! నీ నిష్కైతుక జాయమాన కటాక్షంబున కనేక వందనం

బులు. నీవా ద్వారకాపతి కరిగి భగవంతుండైన గోపాలదేవుని దర్శించి న
వాక్యంబులుగా నాతనితో నిట్లు విన్నవింపుము.

తే॥ గీ॥ నీపదంబులసాక్షిగా ♦ నిజము బల్కు
చున్నదానను నాలింపు ము ♦ శ్లోకచరిత
నాడుచిత్తమునీయందు ♦ నాటియుండె
బాల్యమాదిగ; యదువంశ ♦ వార్ధిచంద్ర.

ఉ॥ శ్రీరమణీమనోహర! య ♦ శేషగుణాకర! దీనలోకమం
దార! భవత్పదాబ్జయుత ♦ తత్పరనై తనరారు నన్ను నుర్
ధారుణియందుఁ జైద్యునకుఁ ♦ దవ్వకనీయగ నెంచెరుక్మి రా
వే! విబుధేంద్రవంద్య! కన ♦ వే! దయఁబూనుచు నన్ను నేలవే.

తే॥ గీ॥ తనువు నీయధీనముజేసి ♦ తనరనున్న
నన్నుఁ జైద్యుండు గొనగను ♦ న్నాడు; కుమతి
యగుచు; నీప్రభావంబును ♦ నరయలేక
వానిఁ దెగటార్చి నసుఁగావు ♦ వాసుదేవ.

ఉ॥ ఘోరరణప్రవీణ! యదుకుం ♦ జర! కంసవిదార! భక్తమం
దార! మహాత్మ! కన్యకు స్వ ♦ తంత్రత యొప్పదుగాన బ్రీతిమై
జేరగవచ్చి యిచ్చుటకు ♦ చేదిప సాల్వజరాసుతాదులన్
గ్రూరశిలీముఖంబులను ♦ గూల్చినన్ గొనిపొమ్ము వచ్చెదన్.

ఉ॥ దేవ! మదీయవిన్నపము ♦ దివ్యమనంబునఁ జిత్తగించి దు
ర్భావులఁ గూల్చి రాక్షస వి ♦ వాహమునన్ నను గొంచుబోవ సే
నావళితోడరమ్ము నర ♦ నాయకులచ్చెరువందునట్లు; ల
క్ష్మీవర! త్వత్పదాంబురుహ ♦ సేవకురాలను బ్రోవగాఁదగున్,

కృష్ణా! వాసుదేవా! సమస్తసుగుణాభరణుండవును, శ్యామసుందర విగ్రహుండవును, నగు నిన్ను నేను గోరినందుకు నేరముగా భావింపకుము. లక్ష్మీకాంత నిన్నుఁ గోరి నీపాదసేవఁజేయుచు నీకృపకుఁ బాత్రురాలై యుండలేదా! దేవా! నేను పూర్వజన్మంబున సద్వ్రతంబుల నాచరించియుండి, నిన్నే చిత్తంబున నమ్మియుండినదాననేని నీవే నాకు నరుండవగుదువుగాక! హా! జగద్రక్షకా! వీరభటరక్షితంబైన యంతఃపురంబుననున్న కాంత నెట్లు తేగలుగుదునని నీవు శంకింపవలదు. కులదేవయాత్రయైన పిదప మావారు నన్ను బురివెలుపలనున్న దుర్గకు మ్రొక్కింపదోడ్కొనిపోవుదురు. నీవాసమయంబున రథముతో నచ్చట సిద్ధమైయుండి నన్నుఁ గొనిపోవచ్చును. మనోహరా! నీవు నన్ను రక్షింపరాకుంటివేని, నీ నామస్మరణంబు సేయుచు, వేయిజన్మంబులకైనను నిన్నే పతిగాఁగోరుచుఁ బ్రాణంబులు విడిచెదను.''

అగ్ని—రుక్మిణీ! నీసందేశము పూర్తియైనదా!

రుక్మిణి—బ్రాహ్మణోత్తమా! ఇదియే నాసందేశము. ఇంక నీచిత్తము.

అగ్ని—అమ్మా! నీవు విచారము విడిచి ధైర్యచిత్తవయి యుండుము. నాకించుక జ్యోతిషముగూడ దెలియును. ప్రశ్న జూచితిని. కృష్ణుండు తప్పక నావెంట వచ్చి నిన్నుఁ గొనిపోవును. ఇంక నేను ద్వారకాపురంబున కరుగుటకు సెలవిమ్ము.

రుక్మిణి—భూసురాగ్రణీ! నేను పలుసారులు నీతో జెప్పవలసినపని లేదు. భారమంతయు నీదియైయున్నది. నీవు వచ్చువరకును నిమిషమొక యుగముగా గడుపుచుండెదను. నీవతిజాగరూకుఁడవై ద్వారకానగరంబున కరుగవలయును. శ్రీకృష్ణుండరుదెంచువరకును నీరహస్యమెవ్వరికిని దెలియఁగూడదు. నీప్రయాణముసంగతి శిశుపాలాదులెఱింగిరేని హానిగూర్తురు.

అగ్ని—అమ్మా! నీవు నావిషయమై భయమందవలదు. హరిపాదారవింద భజనానందపరుండనైన నన్నువారేమిసేయఁగలరు. అయినను నాచేతిలో తాటియాకు గొడుగును, కఱ్ఱయును యుండును. ఎట్టిశూరులు నన్నడ్డగించినను యీ రెండుయాయుధంబులును, వారి ప్రాణంబులుదీయుటకు జాలును. ఇంక నే నరిగెదను.

విమ—కార్యసాఫల్యము జేసికొని వచ్చితినా నీపుణ్యము పండినదని తలంపుము.

అగ్ని—ఆసంగతి నీవు నాకు జెప్పవలెనా. (నిష్క్రమించును.)

విమ—చెలీ! రుక్మిణీ! ఇంక నీవు సంతాపంబును విడిచి సంతోషంబున నుండుము. రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.





# వైదర్భీవిలాసము.

## పంచమాంకము.

ద్వారకాపురము—రాజవీధి.

[అగ్నిద్యోతనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అగ్ని—(తనలో) ఇప్పటికి ద్వారకాపురము జేరుకొంటిని. సముద్రమధ్యమందున్న యీమహాపురంబునకు నే నెట్లు జేరితినో నాకే తెలియకున్నది. భగవత్కార్యము బూనుటచేత నింత త్వరితముగా నరుదెంచితినని తోచుచున్నది. లీలామానుష విగ్రహుండై ధరాభారంబు వాప యాదవవంశంబున జనించిన భగవంతుండైన శ్రీకృష్ణుండు గోపాలాదిజనంబులతోడ వసించుటకు వార్ధిమధ్యంబున నబ్ధిగంతుని యాజ్ఞ ననుసరించి విశ్వకర్మ సృజించిన పురంబిదియేకదా. దేవతానగర మెన్నఁడును వీక్షించియుండలేదుగాని యదికూడ దీనికి సరిరాదని చెప్పవచ్చును. విశ్వకర్మనిర్మితంబై యుండుటం జేసి యయోధ్యాది సకలపురంబుల యందున నగ్రగణ్యంబై వైకుంఠంబునుబోలి విలసిల్లుచున్నది. ఆహా! దీని సొంపు వర్ణించుటకు వేనోళ్ళుగల శేషునికైనను దరముగాదు. ఎచ్చట జూచినను శ్రీకృష్ణుని నామసంకీర్తనంబు సేయు భక్తబృందంబులే. ఏవంక వీక్షించినను వాసుదేవుని చర్యలవర్ణించెడి పౌరకాంతలే. ఏవైపుఁ జూచినను మంగళవాద్యములే. "నిత్యకళ్యాణము; పచ్చతోరణము" అను సామెత నీపురంబు రూఢిచేయుచున్నది. ఆహా! నేను పూర్వజన్మంబున నెంతయో పుణ్యము జేసుకొనుటచేతనే భగవంతుఁడైన శ్రీకృష్ణునిఁ జూచుటకు రుక్మిణిపంపున వచ్చు భాగ్యంబు గంటిని. (ఇంచుక యూరకుండి) ఈనగరవిచిత్రంబులు జూచుచుం బ్రస్తుతకార్యంబు మఱచితిని. ఇంక నేను సత్వరముగ నందనందనుని దర్శించి రుక్మిణీసందేశంబును దెలుపవలయును. ఆశ్రీకృష్ణుని సౌధంబు నెట్లు

గనుఁగొందునో కదా! (ఇంచుక యూరకుండి) ఏమిదీ! వెఱ్ఱి! శ్రీకృష్ణునిమందిరంబు గనుగొనుట యెట్లోయని తలంపుచుంటిని. అదిగో! పురంబునందున్న సౌధంబులందెల్ల మేటియై నభోమండలంబునకంటుచు, మణిమయప్రాకారపరివృతమై, వీరభటపరివేష్టితమై ప్రకాశించునదియే వాసుదేవుని సౌధఁబని తోఁచుచున్నది. (ఇంచుక నడచి) ఇదిగో వాసుదేవుని సౌధంబును సమీపించినాను. నారాక నాతని కెవ్వరెఱింగింతురో కదా. గొప్పవారి దర్శనంబగుట బహు కష్టము. (ఇటునటుఁజూచి) అదుగో. యెవ్వఁడో యొక వృద్ధకంచుకి యిట్లు వచ్చుచున్నాఁడు. వాని నడిగెదఁగాక.

[కంచుకి ప్రవేశించును.]

కంచుకి—(తనలో) ఆహా! జరాభారపీడితుండైన వాఁడొరులసేవించుట మిగుల కష్టము. సంపదచే మదోన్మత్తులై కొందఱు వృద్ధులైన తమ సేవకులను మిగుల కష్టపెట్టుచుందురు. భగవత్స్వరూపుండైన యీ వాసుదేవుండు వృద్ధసేవకులను నే బరువైనకార్యంబులందును నియోగింపక, నొకపూట కొలువునకు రాకపోయినను సైరింపుచు, ద్వారముకడమాత్రము నుండుమని యాజ్ఞాపించినాఁడు. ఇట్టిప్రభు వెవ్వరికైన దొరకునా! ఈశ్రీకృష్ణుం డాచంద్రార్కతారావనీశరధిస్థాయిగ జీవించు గాక! ఈతనివంశంబు వృద్ధిబొందుఁగాక!

అగ్ని—(కంచుకిని జూచి) ఓయీ! కంచుకీ! నీవిచ్చట ద్వారరక్షకభటుండవేనా!

కంచుకి—అవును! మీరెవ్వరు!

అగ్ని—నేనొక బ్రాహ్మణుండను. శ్రీకృష్ణసందర్శనార్థమై యరుదెంచినాడను.

కంచుకి—బ్రాహ్మణోత్తమా! ముందుగా నా నమస్కారము లందుకొనుము.

(నమస్కరింపుచున్నాఁడు.)

అగ్ని—దీర్ఘాయుష్మాన్ భవ! (ఇంచుక యూరకుండి) ఓయీ! శ్రమవహించి సమయమయ్యేనేని నీవు నారాక శ్రీకృష్ణున కెఱింగింపఁగలవా!

కంచుకి—అయ్యా! కృష్ణుండు బ్రాహ్మణులువచ్చిరని వినెనేని యెన్నికార్యంబులున్నను నవియన్నియు విడిచి ముందుగా తనదర్శనము వారి కొసంగును. ఇప్పుడు కృష్ణుండు తన నర్మసఖుండయిన సునందునితో నేదియో మాటలాడుచున్నాఁడు. ఆతనిని దర్శించుటకిది మంచిసమయము. నే నేగి మీరాక నెఱింగించెదను.

(నిష్క్రమించును.)

అగ్ని—(తనలో) ఈసేవకుండెవ్వరోగాని గడు మంచివాఁడు. ఇప్పురంబుననున్నవారెల్లరును బ్రాహ్మణభక్తి కలవారని తోఁచుచున్నది. (ఎదుటఁజూచి) అదుగో! కంచుకి వచ్చుచున్నాఁడు.

కంచుకి—(ప్రవేశించి బ్రాహ్మణునిఁజూచి) అయ్యా! మాశ్రీకృష్ణుఁడు సత్వరమున నీ దర్శనము చేయఁగోరుచున్నాఁడు, రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

[రంగము—శ్రీకృష్ణునిమందిరము—ప్రవేశము.

[శ్రీకృష్ణుఁడు—సునందుఁడు.]

సునం—మిత్రమా! నీవు గడు మాయావిద్యాధురంధరుండవునుమా!

కృష్ణు—అట్లు చెప్పుచుంటివేమి?

సునం—ఏమియును లేదు.

తే॥ గీ॥ ఆహవంబున గెల్వఁగా • నలవిగాని
కాలయవనుని మాయచేఁ • గాలుప్రోలి
కంపినాడవు త్రుటిలోన • నంబుజాక్ష
నీదుశక్తి నెవ్వారు వ • ర్ణింపఁగలరు.

ఇది యట్లుండ భుజవీర్యసింధుండగు జరాసంధుండు ప్రవర్షణగిరి దహించినప్పుడు వాని నెట్లో వంచించి బలరామునితోఁ బురంబు జేరితివి?

కృష్ణు—మిత్రమా! మాయను మాయచేతనే భేదింపవలెనుగదా!

సునం—మొన్న రుక్మిణీస్వయంవరార్థమై నీవరిగినప్పుడు తక్కిన రాజలోకంబును బాఱదోలి యక్కన్నియను నీవు గొనకుండుట నాకు మిగుల వింతగానున్నది. ఆసాల్వజరాసంధశిశుపాలాదులను నాసమయంబునందే దుంచకపోయితివా?

కృష్ణు—అది సమయముగాదు. రుక్మిణీ సోదరుండయిన రుక్మి యక్కన్యకను నెట్లయిన శిశుపాలునకీయఁ బ్రతిజ్ఞ వహించియున్నాఁడు. సాల్వజరాసుతాదులును నేనచ్చట కేగియుండుటంజేసి దానికంతరాయముఁ గల్పించిరి. దానికిదోడు దేవేంద్రుండు శిలావర్షంబు గురిపించుటంజేసి యొనరిదారిని వారేగిరి.

సునం—ఆ భీష్మకుండు రుక్మిణిని నీ కర్పింపలేదను కోపముచేత గాబోలు పాకారి పాషాణ వర్షము గురిపించినాడు.

కృష్ణు — ఎట్లయిన నేమి ! కార్యమునకు భంగము కలిగినదికదా ?

(అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును.)

అగ్ని — (తనలో) ఆహా ! నా పూర్వపుణ్యవశంబున శ్రీమన్నారాయణావతారుండగు కృష్ణునిఁ జూడఁ గలిగితిని.

మ॥ వరుఁడంచున్ వరవల్లకీసతులు దై ♦ వంబంచు ఋష్యాళి నుం
దరపుత్రుండని సంతసంబున యశో ♦ దా దేవకీ దేవులున్
ధరణీశుండని ద్వారకాజనములే ♦ ధన్యాత్ము సేవింతురా
వరలక్ష్మీశునిఁ గృష్ణుఁ గాంచితిని మ ♦ ద్భాగ్యంబు సామాన్యమే.

ఆహా ! యేమి ! యీ మూర్తియొక్క వైభవము ! ఇట్టి మహాత్ముని నిందించిన యా రుక్మి మహాపాపంబునకు పాత్రుఁడైనాఁడుకదా !

ఉ॥ కూళతనంబుబూని ; యదు ♦ కుంజరుఁడౌ ననుదేవసూతికన్
బాలికనీయనెంచరఁ గృ ♦ పారహితుండగు రుక్మి ; చేది భూ
పాలున కీయ నెంచెగద ♦ భావమునందున నెంచిచూడఁ ; దు
శ్శీలురు మంచిచెడ్డఁ బరి ♦ శీలన జేయఁగ జాలరక్కటా.

ఇంక నేను యాలస్యము సేయక నీతనిని దర్శించి సందేశంబును జెప్పెదఁగాక !

కృష్ణు — (ఆసనము దిగివచ్చి బ్రాహ్మణునిఁ జూచి) భూబృందారకా! భవదీయ పంకేరుహంబులకీ సేవకుఁడు నమస్కరింపుచున్నాఁడు.

అగ్ని — శీఘ్రమేవ కల్యాణ సిద్ధిరస్తు.

సునం — భవదీయమోఘాశీర్వచనంబు ఫలించుఁగాక. బ్రాహ్మణోత్తమా! నీవు నాకంటె పెద్దవాఁడవు. నా నమస్కారములుకూడ నందుకోవయ్యా.

కృష్ణు — (అగ్నిద్యోతనుని జూచి) దేవా ! ఈ పీఠం బలంకరింపుడు

(అగ్నిద్యోతను డాసీనుఁడగును)

సునం — ఏమయ్యా ! బ్రాహ్మణుడా ! నీ పక్షపాతము గనబడుచున్నది. కృష్ణునకు "కల్యాణసిద్ధిరస్తు" అని యాశీర్వదించితివి. నాకేమి యాశీర్వదించితివి. మా

యింటి యజమానురాలిచేత చీపురుకట్ట దెబ్బలు తప్పవని యైనను నాశీర్వదించవయ్యా!

కృష్ణు — (సునందునిఁ జూచి) మిత్రమా! ఇంచుక కాల మూరకొనుము.
(అగ్నిద్యోతనునిఁ జూచి)

తే॥ గీ॥ అవని! నీ వాసభూమియై ♦ యలరెనేది
దానిఁ బాలించుచున్న భూ ♦ దారుఁడెవఁడు
నన్నుఁ జూడంగనరుదెంచి ♦ నాఁడవేల
ధన్యగుణసాంద్ర భూమి బృం ♦ దారకేంద్ర.

మ॥ ధరణీదేవ! త్వదీయదర్శనమునన్ ♦ ధన్యుండనై వెల్గితిన్
బురివారెల్లఁ గృతార్థులైరి; భవనం ♦ బుల్ నేఁడు, నీదివ్య పా
దరజం బంటుటచేత పావనతఁ ద ♦ థ్యంబొప్పఁగాఁగాంచె; స
త్కారణన్ దెల్పుము నీయభీష్టము వినం ♦ గౌతూహలంబయ్యెడిన్.

అగ్ని — కృష్ణా!

తే॥ గీ॥ వరవిదర్భాపురంబు ని ♦ వాసభూమి
దానిఁబాలించు భీష్మక ♦ ధరణిధవుఁడు
కృష్ణు— అతఁడు సౌఖ్యంబులందుచు ♦ నలరువాఁడె
పరిజనంబులతోఁడను ♦ బలుకుమయ్య.

అగ్ని— అందఱును గుశలంబుగనే యున్నారు.

సునం— (తనలో) ఈతఁ డేదియో స్వయంవరవార్తఁ జెప్పుటకే వచ్చినట్లు తోఁచుచున్నది.

కృష్ణు— దేవా! భవదీయ రాకకు గారణం బెఱుంగ వచ్చునా!

అగ్ని— భగవంతా! వాసుదేవా! సర్వలోకంబులను గుక్షియందు దాల్చిన నీకు నా రాకకుఁ గారణంబు దెలియకుండునా! అయినను నానోట వినఁ దలంచియు యడుగుచుంటివి. కావునఁ జెప్పెదను. ఆ విదర్భ పురాధీశ్వరుండగు భీష్మకునకు సకలసద్గుణపేటియగు రుక్మిణియను నొక కుమారీరత్నంబు గలదు.

కృష్ణ — ఆసంగతి నే నెఱింగి యుండుటయే గాక తత్ప్రయత్నంబునకై నేను వచ్చియున్నాను. కారణాంతరములచే దానికి భంగముఁ గలిగినది.

అగ్ని — ఆకన్యక హృదయంబు బాల్యంబాదిగ నీపైఁ జిక్కియుండుటచే నామె నీ విమల పాదపంకేరుహ దాస్యంబు సేయఁదలంచి మంగళకరంబైన యొక్క సందేశంబు నీకు విన్నవింపుమని నన్నుఁ బుత్తెంచినది.

సునం — (కృష్ణునిఁజూచి) మిత్రమా! నీ రొట్టె నేతిలో పడినది.

కృష్ణ — బ్రాహ్మణోత్తమా! ఆసందేశ మేమని?

అగ్ని — ఇదిగో చెప్పెదను. సావధాన చిత్తుండవై యాలింపుము.

"తే॥ గీ॥ నీపదంబులసాక్షిగా ◆ నిజముబల్కు
చున్నదానను నాలింపుము ◆ శ్లోకచరిత
నాదుచిత్తము నీయందు ◆ నాటియుండె
బాల్యమాదిగ; యదువంశ ◆ వార్ధిచంద్ర."

ఉ॥ శ్రీరమణీమనోహర! య ◆ శేషగుణాకర! దీనలోక మం
దార! భవత్పదాబ్జనుత ◆ తత్పరనై తనరారు నన్నుఁ దా
ధారుణియందుఁ జైద్యునకుఁ ◆ దప్పకనీయగ నెంచెరుక్మి రా
వే! విబుధేంద్రవంద్య! కన ◆ వే! దయఁబూనుచు నన్నునేలవే.

తే॥ గీ॥ తనువు నీయధీనముజేసి ◆ తనరనున్న
నన్నుఁజైద్యుండు గొనఁగను ◆ న్నాఁడు ; కుమతి
యగుచు; నీప్రభావంబును ◆ నరయలేక
వానిదెగటార్చి నన్నుఁగావు ◆ వాసుదేవ.

ఉ॥ ఘోరరణప్రవీణ! యదుకుం ◆ జర! కంసవిదార! భక్తమం
దార! మహాత్మ! కన్యకు స్వ ◆ తంత్రత యెప్పుడుగానబ్రీతిమై
జేరఁగవచ్చి యిచ్చుటకు ◆ చేదిపసాల్వజరాసుతదుల్
క్రూరశిలీముఖంబులను ◆ గూల్చిననన్ గొనిపొమ్ము వచ్చెదన్.

ఉ॥ దేవ ! మదీయవిస్మయము ♦ దివ్యమనంబునఁ జిత్తగించి దు
ర్భావులఁగూల్చి రాక్షస వి ♦ వాహమునన్ ననుగొంచుబోవ నే,
నావళితోఁడరమ్ము నర ♦ నాయకులచ్చెరువందునట్లు ; ల
క్ష్మీవర ! త్వత్పదాంబురుహ ♦ సేవకురాలను బ్రోవగాదగున్.

కృష్ణా! వాసుదేవా! సమస్తసుగుణాభరణుండవును, శ్యామసుందర విగ్రహుండవును నగు నిన్ను నేను గోరినందుకు నేరముగా భావింపకుము. లక్ష్మీకాంత నిన్నుఁ గోరి నీపాదసేవఁజేయుచు నీకృపకుఁ బాత్రురాలై యుండలేదా ! దేవా! నేను పూర్వజన్మంబున సద్వ్రతంబుల నాచరించియుండి, నిన్నే చిత్తంబున నమ్మియుండినదాననేని నీవే నాకు పతియుండవగుదువుగాక ! హే ! జగద్రక్షకా ! వీరభటరక్షితంబైన యంతఃపురంబుననున్న కాంత నెట్లు తేగలుగుదునని నీవు శంకింపవలదు. కులదేవయాత్రయైనపిదప మావారు నన్ను బురివెలుపలనున్న దుర్గకు మ్రొక్కింపదోడ్కొనిపోవుదురు. నీవాసమయంబున రథముతో నచ్చట సిద్ధమైయుండి నన్నుఁ గొనిపోవచ్చును. మనోహరా ! నీవు నన్ను రక్షింపరాకుంటివేని, నీ నామస్మరణంబు సేయుచు, వేయిజన్మంబులకైనను నిన్నే పతిగాగోరుచుఁ బ్రాణంబులు విడిచెదను.''

సునం — (కృష్ణునిఁజూచి) వాసుదేవా ! నీపుణ్యము పండినది.

అగ్ని — కృష్ణా ! సందేశము వింటివిగదా.

కృష్ణు — మహాత్మా ! వింటిని. (ఆలోచింపుచున్నాఁడు.)

అగ్ని — కృష్ణా ! ఏదియో యాలోచింపుచుంటివి.

ఉ॥ ఆలలితాంగి; చంద్రముఖి; ♦ యావికచాంబుజ పత్రనేత్రి; యా
బాలిక, సచ్చరిత్రి, గుణ ♦ పావని, నిర్మలచిత్త, ధర్మసం
శీల; త్వదీయ పాదయుగ ♦ సేవనుసర్వగ నర్హురాలు; గో
పాలక వంశశేఖర! కృ ♦ పామతి నామె ననుగ్రహింపుమీ.

దేవా ! అక్కన్నియ కీవును, నీ కామెయు దగియుండిరి. ఆమె సౌందర్యంబును గూర్చియు సద్గుణంబులను గూర్చియు వర్ణించుటకు శేషునకైనను శక్యంబుగాదు.

ఉ॥ ఆడదసత్యవాక్యముల ♦ నాశ్రితరక్షణ బుద్ధిమెప్పుడున్
వీడదు; సేవకాతతిని ♦ విప్రులబంధులఁ గోపదృష్టిచేఁ

జూడదు భీష్మకన్యయను • చుం జనులెల్ల బ్రశంసజేతురా
చేడియఁ గావరమ్ముకడు • శీఘ్రగతిఁ యదువంశచంద్రమా.

కృష్ణు— భూసురోత్తమా! ఆకన్నియను శిశుపాలునకీయదలంచి రుక్మి ప్రతినవహించి యున్నవాఁడు. నాకు వైరులైన జరాసంధ దంతవక్త్ర సాల్వాదులా శిశుపాల పక్షపాతులై తన్మహోత్సవ సందర్శనార్థమై యరుదెంతురు. నేను వారి రాకకు భయమందుటలేదు గాని యకారణ కలహంబు గలిగించుకొని లేనిపోనిది పైఁ బెట్టుకొనుట యేలయని సందియంబందుచుంటిని.

అగ్ని— వాసుదేవా! నీవు సాక్షాద్భగవంతుండవు. మముబోంట్లను మాయామోహసాగరంబున ముంచుట కిట్లు వర్ణింపుచుందువు. ప్రపంచకమంతయు నీ మాయయైయున్నది. నీవు కన్నుమూసియుంచితివేని సర్వజగంబులును లయంబందును. లోకంబున నీకు శత్రువులొకరుగలరా! ఇదియంతయు లీల. భూభారమునకై యిటు వైషమ్యంబులు గల్పింపుచుందువు. నీవు నిజముగా గోపదృష్టిచే, జూచితివేని జరాసంధాదులెంత! భగవంతా! నావిన్నపమొక్కటి యాలింపుము.

ఉ॥ గారము నీయెడఁ మిగుల • గానిడి యున్నలఁ దమ్ములం దిర
స్కారమొనర్చి నిన్ను విభు • గా వరియించిన రుక్మిణీ
వారిరుహాక్షి తాపమును • బాపగ నెట్టులనైన వచ్చి వం
కేరుహలోచనా విమల • కీర్తి గడింపుము ధారుణీస్థలిఁ.

ఆరుక్మిణీవధూటి నీపై దనచిత్తంబును బాదుకొల్పి నిద్రాహారంబులమాని నిరంతరమును నీ నామస్మరణంబు గావింపు నీరాకకై వేచియున్నది. నీవామెను గరుణింపవేని యామె ప్రాణంబులబాయుట నిశ్చయంబు. భక్తరక్షణపరాయణుండవయిన నీవామెను రక్షించుటయే కర్తవ్యము. ఆవైదర్భి శ్రీమద్రమాదేవియగుటంజేసియే శ్రీమన్నారాయణుండవగు నిన్ను వరించినది. కావున,

కం॥ వేంచేయు, మావి దర్భకుఁ
జంచ, ద్బల శౌర్యధాటి • శాత్రవులను నొ
ప్పించుము సంగర మందున
నంచితగతి బెండ్లియాడు • మారాజ సుతఁ.

మ॥ విలసత్పూర్ణ శశాంక బింబవదనన్ ♦ విద్యుత్ప్రవాళాధరిన్
జలజాక్షిన్; గజేంద్ర మందగమనన్ ♦ శాతోదరిన్ సుందరిన్
గలకంఠిన్; భవదీయ దాస్యకలనా ♦ కామన్, విదర్భాసుతన్
గలికిం గైకొని భూపతుల్ బొగడ లో ♦ కఖ్యాతిఁ జేఁబట్టుమీ.

కృష్ణు—భూసురమణీ! మంగళకరంబైన రుక్మిణీ సందేశంబును, నీవాక్యంబులును నా హృదయంబును గలంగఁజేయుచున్నవి. ఆర్తరక్షణ దీక్షాబద్ధకంకణుండనైన నాకిక్కార్యముసేయుట యావశ్యకమైయున్నది.

మ॥ వనజాతాక్షి తదీయచిత్తమును నా ♦ పై నిల్పియున్నట్లుగా
వినియుంటిన్ మును; నేను నాకరణి నబ్బింబోష్ఠినే యెప్పుడున్
మనమందున్ దలపోయుచుంటిని గదన్ ♦ గాలంబు నీక్షింపుచున్
వినుమాకుండిన కేగుదెంచెద నికన్ ♦ బృథ్వీ సురగ్రామణీ

తే॥ గీ॥ అతివ రుక్మిణి నన్ వివా ♦ హంబునాడ
నుండ; దానికిఁ దత్సోద ♦ రుండు నడ్డు
బెట్టె; శిశుపాలునకునిచ్చి ♦ పెండ్లిసేయ
దలచుటయు జరాసుతుండు మొ ♦ దలగువారు
నన్ను వంచింపనెంచుట ♦ మున్నెఱుఁగుదు
కాలమునకయి వేచితి ♦ ధర్మసురేంద్ర.

బ్రాహ్మణోత్తమా ? వేయేల !

మ॥ అనఘా! యింక విదర్భజేరెదను ము ♦ ఖ్యప్రాణ వేగంబుతో
ననియం దెవ్వరెదిర్చినిల్చిన మహో ♦ ద్యచ్చక్ర ధారాహతిన్
వినువీధిన్ జనశీర్షముల్ దఱిగెదన్ ♦ బృందారుల్ నుతింపంగ; న
వ్వనజాతాక్షిని దోడితెచ్చెదను భూ ♦ పాలుర్ విలోకింపఁగన్.

(సునందునిజూచి) మిత్త్రమా? సునందా! ఈసంగతి బలరామునికిఁ దెలిపి చతురంగబలముల నాయత్తపఱచి ప్రయాణసంసిద్ధునిగా నుండుమని చెప్పుము. మఱి

యాదారకునితో సైన్యసుగ్రీవమేఘ పుష్పబలాహకంబులను తురంగంబులనుగట్టి సమస్తాయుధోపేతంబుగా రథమును నాయత్తపఱుపుమని చెప్పుము. ఈరాత్రియే ప్రయాణము. తెల్లవాఱునప్పటికి విదర్భ జేరవలెను. (అగ్నిద్యోతనునిజూచి) బ్రాహ్మణోత్తమా! మార్గాయాసంబున మిగుల డస్సియున్నవాడవు. మజ్జనభోజనాదు లయినపిదప నించుక విశ్రమింతువుగాని. రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





# వైదర్భీవిలాసము.



## షష్ఠాంకము.

[ రంగము. విదర్భాపురము:—శ్రీకృష్ణుండును, తారకుండును బ్రవేశించుచున్నారు. ]

కృష్ణ— తారకా! రథచోదకనైపుణ్యంబునందు దేవేంద్రుని రథసారథియగు మాతలి యైనను నీకు సమానుండు కాదుసుమా!

తే॥ గీ॥ ధరణి గిరగిరందిఱిగెఁ బాం • గరము భాతి
వృక్షములు తేరుతోవచ్చు • రీతిఁ దోఁచె
చక్రసంఘట్టన ధ్వనికి • శత్రుచయము
భీతినందు కరణి నడ • పించినావు.

నీ సామర్థ్యంబుచేతనే మనమింత త్వరగా విదర్భపురం గలితిమి!

తార— దేవా! లీలామానుష విగ్రహుండవును, భగవంతుండవును నైన నీవు రథిపై యుండుటచే భవన్మహిమచే రథంబింత త్వరగా నిచ్చటకు జేరినది గాని నా సామర్థ్యంబాకింతయు లేదు. నేను భవత్కరుణాపాత్రుఁడను గాని శ్లాఘాపాత్రుఁడను గాను.

కృష్ణ—

మ॥ సరసీజాక్షి స్వయంవరంబునకు సం • సత్తోషమేపార; స
త్వరగా జేరుటయందు నెంతయునుఁ జి • త్తంబందు శంకించినా
నరయన్ నేఁడు భవత్సమర్థత మహా • నందంబు గల్పించె; నీ
సరణిన్ దేరునడోల రెవ్వరును మె • చ్చన్ వచ్చునిన్ దారకా.

తార—

సీ॥ సృష్టికార్యమునందు ♦ బ్రహ్మను నియమించి
శిష్టుఁడై యెవఁడు రా ♦ జిల్లినాఁడు
ఎవని సత్కృపచేత ♦ భవుడు పార్వతితోడ
కైలాస శిఖరిపైఁ ♦ గ్రాలుచుండు
ఎవని యాజ్ఞనుబూని । యినుఁడు తనదు దీప్తి
క్షితితలంబున వెల్గఁ ♦ జేయుచుండు
అమరపతికి ద్రిలో ♦ కాధిపత్యంబును
నెవఁడు కరుణఁబూని ♦ యిచ్చినాఁడు

తే॥ గీ॥ జగమునకు నాది పురుషుఁడై ♦ యొగఁడునెవఁడు
యాదిలక్ష్మికి భర్తయై ♦ యలరె నెవఁడు
యట్టి నారాయణుండవీ ♦ వగుదుగాదె
నిన్నుఁ దెలియంగ వశమె ♦ నీరజాక్ష.

దేవా! నీవు నన్ను వినుతింపనలదు. నీవు సాక్షాద్రమానాథుండవు. నేను నీ పాద సేవకుండను. భగవదాజ్ఞాబద్ధుండను. తొలిజన్మంబున నేనెంతయో పుణ్యము జేసికొని యుండుటచేత నే భగవంతుండవైన నీకు రథసారథినై యుంటిని.

కృష్ణ—తారకా యెంతవెఱ్ఱివాఁడవోయి! నీకు నాయందున్న భక్తిచే నట్లు పల్కుచుంటివి.

తార—దేవా! ఇందు స్తోత్రమేమియును లేదు. నిజమునే వక్కాణించితిని.

సీ॥ అఘటితఘటనా వి ♦ హారుండవనుటకు
త్వద్గురు, కూర్మి నం ♦ దనుఁడుసాక్షి
అఖిల భారధురీణు ♦ డవనుటకు గిరిహ
స్తమున నెత్తిన నీదు ♦ శక్తిసాక్షి
భూభరంబునువాపఁ ♦ బుట్టినా వనుటకు
నల కంస దైత్యమా ♦ రణముసాక్షి

విశ్వగర్భుఁడవంచు ♦ వినుతించుటకు యశో
దకును జూపించు వ ♦ క్త్రంబుసాక్షి

తే॥ గీ॥ యెవరు సేయంగఁ గల్గినా ♦ రిట్టిపనుల
నాది నారాయణుండ వీ ♦ వమలతేజ
భూభరంబును బాపగాఁ ♦ బుట్టినావు
కేవలము మనుజుండవే ♦ కేళిగాని.

భవదీయ మహామహిమ నెఱుంగఁజాలని మూఢులు నిన్ను మానవమాత్రునిగాఁ దలంతురు.

కృష్ణు— తారకా! దానికేమి గాని మన మరుదెంచునప్పుడు భూసురుండైన యగ్నిద్యోతనుఁడు రథవేగంబునకాఁగఁజాలక బంచప్రాణంబులును బిగబట్టుకొని కూర్చున్నాఁడుసుమా. ఆతని మాటలును, నాతని చర్యలును, దలంచిన నాకెంతయు నవ్వువచ్చుచున్నది.

తార— దేవా! నీవు నిజము నక్కాణించితివి.

కృష్ణు— సారథీ! అటుజూడుము. ఈపురంబెంత వైభవముగా నలంకరింపఁబడియున్నదో. ఇందున్న పౌరులెల్లరును తమ రాజపుత్రికా స్వయంవర సమయమగుటచే దమ భక్తినిఁ జూపించుటకు తమ గృహంబులనుగూడ తోరణంబులచే నలంకరించిరి. ఆహా!

సీ॥ రాజవీథులనెల్ల ♦ రతనాల తోరణం
బులచేత నెంతయు ♦ నిలిపినారు
వీథి వీథులయందు ♦ వేశ్యాంగనా నాట్య
ములవేడ్కమై నెల ♦ కొలిపినారు
ఆయాస్థలంబుల ♦ ననవద్యవాద్య ని
ర్ఘోషణంబులు భోరు ♦ కొలిపినారు
నగరంబు చుట్టును ♦ నగణితవీరులై
యొప్పు భటులను గా ♦ పుంచినారు

తే॥ గీ॥ కంటివే! తారకా! కమ్ర ♦ గనుల సందు
వై; విరాజిల్లుచుండు భీ ♦ ష్మావనీశ
నందన పరిణయోత్సవా ♦ నంద సూచ
నార్థ మహిత చిత్రంబు ♦ లమరు నచట.

తార—దేవా! రుక్మిణీ పరిణయోత్సవంబు దెలుపుటకు బురంబింత వైభవోపేతంబుగాఁ జేయఁబడినది.

( తెరలో )

చ॥ అరదము బోవనిమ్ము త్వరతోగా! హరి యొక్కడె యేగియుండె యా
సరసిజపత్రనేత్రను వె ♦ సంగొని తెచ్చెడువట్ల ఘోర సం
గరమగునంచు నెంచెదను ♦ జ్యోధవులెందరో వచ్చియుండ్రు సం
బరమున; దంతవక్త్రశిశు ♦ పాల జరా తనయాది వీరులన్
బోరిగొని నాదు తమ్మునకుఁ ♦ బూర్ణ సహాయ మొనర్పగావలెన్.

తార—వాసుదేవా! భవదీయాగ్రజుండగు బలరాముండుగూడ వచ్చుచున్నాఁడు.
కృష్ణ—అగ్రజుండును నతిత్వరితముగనే వచ్చి మనలను గలిసికొనెను.

[ బలరాముండు ప్రవేశించును. ]

కృష్ణ—(బలరాముని కౌగలించుకొని) అన్నయ్యా! వచ్చితివా!
బల—కృష్ణా! మన సేనలన్నియు బురప్రాంతమున నిలిపి నిన్నరయుచు వచ్చితిని.
కృష్ణ—అగ్రజా! నీవు నాయందు జూపిన నీ కరుణకనేక వందనములు.

(తెరలో మంగళధ్వని.)

బల—ఏదియో మంగళవాద్యంబు వినవచ్చుచున్నదే.
తార—(పరికించి చూచి) పూజ్యులగు నో యన్నదమ్ములారా! మహాత్ములయిన మీ రాక భీష్మక నృపాలుడెఱింగి మిమ్ములను దోడ్కొనిపోవుట కెదురుగా వచ్చుచున్నాఁడని తలంచెదను.
బల—అట్లే యై యుండును.

[ భీష్మకుఁడు ప్రవేశించును. ]

భీష్మ—(తనలో) ఇరుగో! బలరామకృష్ణులు స్వయంవర మహోత్సవ సందర్శనార్థమై యరుదెంచినారు. (కృష్ణునిఁజూచి) అహా! ఏమి! ఈతని యద్వితీయమైన

తేజము. నిజముగా నితఁడు శ్రీమన్నారాయణావతారుండే. మూఢుండును, దుర్మతుండును నైన నా కుమారుండు రుక్మిణిని నితని కీయకుండఁ గావించినాఁడు. నిర్భాగ్యుఁడనైన నాకీతఁడు జామాతయగు భాగ్యమెట్లు లభించును. అట్టి భాగ్యము లేకపోయినను నీ మహానుభావునకు నమస్కరించి తగు సత్కృతులం జేసియైనను గృతార్థుఁడనయ్యెదను. (కృష్ణుని సమీపించి)

సీ॥ సనకాది మౌనీంద్ర ◆ సంఘమానసపద్మ
భృంగమై యెవ్వాఁడు ◆ వినుతిఁగాంచు
పద్మాలయాదేవి ◆ వాంఛించి యేదేవు
పాదకైంకర్యంబు ◆ బడయఁ గలిగె
భువనమోహనరూప ◆ మునుదాల్చి యమృతంబు
నెవ్వాఁడు విబుధుల ◆ కిచ్చిమించె
దుర్మద దైత్యులఁ ◆ దున్మాడ నవతార పురుషుఁడై
తెలుచుగా నెవ్వాఁడు ◆ తనరుచుండు

తే॥ గీ॥ నట్టి లక్ష్మీకళత్రుండ ◆ వగుదువీవు
లీలకై మనుజుండవై ◆ గ్రాలినావు
నాదు భాగ్యవశమున నిన్ ◆ గాంచినాఁడ
సందియము లేదు నిక్కంబు ◆ సారసాక్ష,

పూజ్యులగు నో బలరామ కృష్ణులారా! అస్మత్కుమారీపరిణయ మహోత్సవ సందర్శనార్థమై మీరరుదెంచుటంజేసి నే నెంతయు ధన్యుండనయితిని. నాకులము పావనంబైనది. అల్పుండనగు నేను మిమ్మెట్లు పూజింపవలయునో తెలియదు.

కృష్ణు—నృపాలా!

ఉ॥ నీవు మహానుభావుఁడవు ◆ నిర్మలధర్మ వివేకశీల స
ద్భావము నీదుసొమ్ము; నర ◆ పాలురయందున మేటివీవు; నీ
భావమెఱింగియుంటి భగ ◆ వంతుఁడు సత్కృపబూని నీదు స
త్సేవకు సంతసిల్లి కడు ◆ శీఘ్రగతిన్ నిను ధన్యుఁ జేసెనున్,

ష్మ — పురాణపురుషులారా! మీరాకచే నాకులము పావనంబైనది. నాయొసర్చు సత్కారంబుల స్వీకరింప దయాంతరంగులై పురిలోనికిదయసేయుఁడు. రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

[రంగము:—విదర్భపుర ప్రాంతోద్యానవన సమీపంబున దుర్గాలయము.]

(అగ్నిద్యోతనుఁడు—ప్రవేశము.)

గ్ని—(తనలో) ఆహా! నేనుసమయంబునకే వచ్చితిని లేకున్నచో రుక్మిణి యెంత సాహసకార్యము జేసియుండునోగదా. పరిణయ మహోత్సవసమయం బాసన్నమైనదనియు, నింకను నేను రాలేదనియు మిగుల విచారింపుచుఁ బ్రాణంబులపై నాసవిడి యున్నది. అట్టి సమయంబున నేనామె కంటఁబడి సందేశంబు నాలించి కరుణాంతరంగుండై వాసుదేవుండు నిన్ను రక్షించుట కరుదెంచినాడని తెలిపినంతనే చింతనంతయువిడి, చిత్తంబంతయు నందనందనుని వశంబుగావించి యానందపరవశయై జగంబునే మఱచిపోయినది. శ్రీకృష్ణుని దోడి తెచ్చినందులకు నన్నెన్నో విధంబుల వినుతించి యనేక మణిభూషణంబులు నాకు సమర్పించినది. నేనీవస్తువు లన్నియు భద్రపఱచి యుంచవలెను. ఎందుకనగా ముందు నాకుమార్తెకును, కుమారునకును వివాహము సేయవలసి యున్నది. ప్రతివాళ్ళు అల్లుడికి కట్నమేమిటి అని అడుగుతున్నారు. వాడికి కాస్త ఆ యుంటేసరి. ఇంకేమి అక్కరలేదు. సప్తకట్ల వెధనకయినా సరే సంచిరూపాయిలు కావలెనని అంటున్నారు. పూర్వము కన్యాశుల్కమొక్కటే యున్నది. ఇప్పుడు వరశుల్కంకూడా బలిసినది. పెద్దవాళ్లు చదువు సంధ్యలు వచ్చినవాళ్లు, ఆస్తిపరులు నయినవారే యిట్టి వరశుల్కముల గోరుచుందురు. వాళ్లకువున్నడబ్బు చాలక యిల్లా సంపాదించినదికూడా వాళ్లమీద వేసుకొని కట్టుకట్టించుకొని పోవటానికి యిల్లా అడుగుచుందురు. (మంగళవాద్యంబు నాలించి) అదుగో! మంగళవాద్యంబులు వినవచ్చుచున్నవి. రుక్మిణిని గౌరీ పూజార్థమై దోడ్కొని వచ్చుచున్నారని తోచుచున్నది. (పరికించి) అవును. అదుగో శిశుపాలాదులుగూడ వచ్చుచున్నారు. ఆహా! ఏమి! ఈ చేదినాధుని గర్వము. రుక్మిణిని పెండ్లియాడుదునని విఱ్ఱవీగుచున్నాఁడు. శ్రీకృష్ణుఁడు వీని నోట్లో మట్టిబెడ్డఁగొట్టి యిప్పుడు రుక్మిణిని దీసికొనిపోవును. దానితో వీడి పాంగు చల్లారును. అదుగో రాజులందఱును వచ్చుచున్నారు.

[శిశుపాల జరాసంధ దంతవక్త్ర సాల్వాదులు ప్రవేశించుచున్నారు.]

శిశు — మిత్రులారా !

మ॥ హరియేతెంచె స్వయంవరార్థము, సము ◆ ద్యత్కౌతుకంబొప్పు; సుం
దరి నేఁగైకొనువేళ నాకుమతి చి ◆ త్తంబందు నోర్వంగలే
కరయన్ రోషముబూని యుద్ధమునొగిన్ ◆ గల్పించెనేనిన్ మహో
ద్ధురసంగ్రామమునందువాని గెలతున్ ◆ దోర్దండ దర్పోద్ధతిన్.

జరా — శిశుపాలా ! అతఁడీకార్యమునందేమియు యుద్ధము గల్పించునని తోఁచదు. మహావీరులమయిన మన మందఱమును నొకటిగాఁగూడి యిచ్చట నుంటిమని యాతడొక్కింత స్వాంతంబున భీతిఁబొందుచునే యుండును. ఒకవేళ నేదియైన నెపంబు గల్పించుకొని పోరాటంబునకు సంసిద్ధుడైనను నేనా విషయంబును గూర్చి శంకఁబొందను.

ఉ॥ యాదవ వీరులందఱును ◆ నాహవభూమిని మట్టుబెట్టి; దా
మోదరుఁగూల్చి దర్పమున ◆ భూరిబలున్ బలరాముఁగెల్చి; బిం
బాధరి నీకుఁగూర్చెద ◆ నృపాలకులెల్లరు సంతసింపగా
చేదిపురాదినాథ యిఁకఁ ◆ జిత్తమునందున శంకయేటికిన్.

శిశు — రాజాగ్రణి ! నా శ్రేయంబుఁగోరిన పరమాప్తులయిన మీరిందఱుండఁగా నాకేమి శంక.

[శ్రీకృష్ణుఁడు, తారకుఁడు, సునందుఁడు ప్రవేశింపుచున్నారు.]

కృష్ణ — సునందా ! ఈ సమయంబున నీవిచ్చటికేల వచ్చితివి ? బలరామాదులయొద్ద నుండలేకపోయితివా !

సున — రాకూడదా యేమి ! వారందఱును సందడిలో నన్ను మఱచిపోవుదురేమో యని నీసన్నిధికి వచ్చినాను. పరిణయోత్సవ మహానందమగ్నుండవై నన్ను వదలకుసుమీ. ఈ సమయములో నెవ్వరైనను నన్ను బట్టుకొందురేమో యని భయముకలుగుచున్నది.

కృష్ణ — మిత్రమా ! నీకింత భయమేమి ? నాయండ నుండగా నిన్నెవ్వరేమి చేయఁగలరు.

తార—(సునందునిజూచి) బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణులు పిఱికివారనుమాట సత్యముజేయుచుంటివే. ఇంత భయమందువాఁడవు గృహమందే యుండలేక పోయితివా?

సునం—శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని వరించు మహోత్సవంబు నేను చూడనక్కరలేదా యేమిటి? నువ్వేనా యేమిటి చూడడానికి నోచుకొన్నావు.

తార—అయ్యో! నేనట్లు చెప్పలేదే! భయమందితివిగాన యట్లు పలికితిని.

సునం—ఇప్పుడు పలికితే పలికితివిగాని నింక ముందెప్పుడును నట్లు బలుకకుము.

కృష్ణ—నీతో నేమాటజెప్పినను కష్టమేగదా.

(తెరలో మంగళధ్వని.)

కృష్ణ—మిత్రమా! అవిగో మంగళవాద్యంబులు వినవచ్చుచున్నవి. రుక్మిణీకాంత గౌరీ పూజార్థమై వచ్చుచున్నది కాబోలు. (పరికించి) అవును. (తారకునిజూచి తారకా! ఆ రుక్మిణీవధూటిరాక యెంత కన్నులపండువుగా నున్నదో చూడుము. మాతంగతురంగ శతాంగాదుల నారోహించి నిజజనక సోదరప్రముఖ బంధుజనబృందం బిరువంకల గ్రమ్ముకొని చనుదేర, శుద్ధాంతకాంతాజనంబు లాందోళికలనెక్కి సంభ్రమంబున నరుదేర, భేరీశంఖకాహళ మృదంగ వేణువీణాద్యానేక మంగళవాద్యంబులు దిక్కులఁబిక్కటిల్ల, నవరంజి పళ్లెంబులందు గౌరీపూజాక్రియాసముచితాభంగమంగళద్రవ్యంబుల నుంచుకొని సువాసినీ సముదయంబేతేర, సహస్రచేటీపరివృతయై, తారకాగణమధ్యంబునఁ బ్రకాశించు చంద్రమండలంబును దీకరించు ముఖసౌందర్యంబు గలిగి, చిఱునవ్వు మోమునఁ దళుకులొత్త చెలికత్తెతో నేదియో భాషింపుచు నా రుక్మిణీవతంస మరుదెంచుచున్నది.

సునం—మిత్రమా! శ్రీకృష్ణా! నేనేమోయని తొలుదొలుత యీమె చిత్రపటంబును నేను చూచినప్పుడు వెఱ్ఱిపలుకులు బలికితిని. ఈమె ముఖసందర్శనం బిప్పుడు చేసినంతనే యీమె నాకు శ్రీమదిందిరాదేవియని తోచుచున్నది.

తార—బ్రాహ్మణోత్తమా! నీవు నిజంబు జెప్పితివి.

[ భీష్మకుఁడు మొదలైనవారును, విపుల సమేతయగు

రుక్మిణియు—ప్రవేశము. ]

విపు—(రుక్మిణితో రహస్యముగా) చెలీ! భవదీయ పరిణయ మహోత్సవ సందర్శనోత్సాహులై యరుదెంచిన రాజులందఱును నిచ్చటకు వచ్చియున్నారు. అల్లదే చూడుము.

తే॥ గీ॥ కఠినరూపముగలలోహ ♦ ఖండమైన
యగ్నియందుబడికఱగు ♦ నట్టికరణి
పరమమునులచిత్తములైన ♦ గరగకున్నె
సుందరాంగిశరీరంబు ♦ జూచినంత.

నే నేదియో పుణ్యముజేసికొని యుండుటచేతనే యీ యిందువదన నన్ను వరించినది.

విమ—(రుక్మిణినిఁజూచి) అమ్మా! కాలహరణం బేల. సత్వరంబుగ జగదంబయగు నీ దుర్గామహాదేవినిఁ బూజింపుము. ఇవిగో పూజాద్రవ్యంబులు.

రుక్మిణి—ఇదిగో వచ్చుచున్నాను.

కృష్ణు—(తనలో) అదిగో! రుక్మిణి గౌరీపూజార్థమై యాలయంబు బ్రవేశించుచున్నది.

రుక్మిణి—విమలా! ఇంక దుర్గాపూజ సలిపెదను. (ఆలయంబునుఁ బ్రవేశించి పుష్పాదులచే గౌరీదేవినిఁ బూజించి)

మ॥ జననీ! నీఘనపాదపంకజములన్ ♦ స్వాంతంబునన్ నిల్పి ని
న్నునుఁబూజింపుచునుంటి నిత్యమును న ♦ న్నుంగావు మీవేళ నీ
ఘనకారుణ్య కటాక్షవీక్షణసుధా ♦ కల్లోలపాదోధి మ
జ్జనమాడంగనొనర్చి భక్తజనర ♦ క్షాదక్షదీక్షాకరీ.

విమ—చెలీ! పూజ పూర్తియైనదా!

రుక్మిణి—అయినది. ఇంక మన మరుగవచ్చును.

(దేవాలయము విడిచి యువతులు వచ్చుచున్నది.)

కృష్ణు—(రుక్మిణినింజూచి సునందునితో) సునందా!

సీ॥ జలదమధ్యంబును ♦ వెలువడియరుదెంచి
మిగులబ్రకాశించు ♦ మెఱుగుకరణి
మృగధరమండలి ♦ నగణితంబుగవీడి
చరియించెడిమృగము ♦ చందమునను

హారు నివంచింపంగ ♦ హారిధరించినయట్టి
యానాటి మోహినీ ♦ యబలవలెను

అలసురాసురులు క్షీ ♦ రాబ్ధినిదర్చ్చ్చహో
బయలు దేఱిన రమా ♦ వనితపగిది

తే॥ గీ॥ యాలయంబును విడనాడి ♦ యరుగుదెంచు
చున్నది; యనంగకేతన ♦ సన్నిభమగు
పైటదూగాడ; రాయంచ ♦ భంగిగాగ
విమలసౌందర్యసీమయా ♦ శోభనాంగి.

రుక్మిణి—(ఆలయంబునువిడిచి యివతలకునచ్చి శ్రీకృష్ణుని దనకేఁగంట జూచుచు తలపంచి చూచుచున్నది.)

కృష్ణు—(తనలో) అదుగో ఆకాంతామణి యివతలకువచ్చి తన కేఁగంటచూపులచేనా రాకకై బ్రతీక్షింపుచున్నట్లుసూచింపుచున్నది. ఈమె సౌందర్యంబును జూచుచు రాజులందఱును విభ్రాంతులై శరీరంబుల మఱచిపోవుచున్నారు. కావున నీమెను గొనిదెచ్చి రథముపైబెట్టుకొని శీఘ్రగతి నరిగెదనుగాక. బలరామసాత్యకిప్రముఖులును జాగరూకులై యుండిరిగదా. (తారకునిఁజూచి) తారకా! అస్మందగమనను నిప్పుడే రథముసెక్కించెదను. నీవతిత్వరితముగ స్యందనంబును బోనిమ్ము.

తార—దేవా! ఆజ్ఞాబద్ధుఁడనై యున్నాను.

కృష్ణు—(తనలో) రథారోహణంబునకై రుక్మిణి చిత్తంబు తత్తరమందుచున్నట్లు యామెచూపులే దెలుపుచున్నవి. కావున నింక జాగుసేయకూడదు. రుక్మిణిని సమీపించి)

మ॥ తరుణీ! చూడుమదే రథంబికను జి ♦ త్తంబందుశంకింపకే
త్వరగానెక్కుముదాని భూరమణు లె ♦ వ్వారైన నేతెంచినన్
వరసంగ్రామతలంబునందున మహా ♦ బాణంబులంగప్పి; త
చ్ఛిరముల్ ద్రుంచెద డొల్చెదన్ మిలిచెదన్ ♦ శీతాంశుబింబాననా,

(రుక్మిణిని యెత్తికొనివచ్చి రథముపైఁ గూర్చుండఁబెట్టి తారకునిజూచి)

శా॥ ఇంకేల సందియమేల తారక! రథం ♦ బీవారిఁబోనిమ్ము మా
తంకం బెవ్వరునైన బెట్టినయెడన్ ♦ దధ్యంబుగా వారలన్
బంకేజాసను డడ్డమై నిలచినన్ ♦ బాహాబలప్రౌఢిమన్
బింకంబార్చెద శాత్రవుల్ చెదఱని ♦ బ్బింబోష్ఠి హర్షింపఁగన్.

(రథసహితుఁడై నిష్క్రమించును.)

సునం—(తనలో) కృష్ణా! కృష్ణా! నన్ను వదలివెళ్లుతున్నావా! వీళ్లెవళ్ళయినా నన్ను జూచినారంటే కృష్ణునిసఖుడనని మెత్తగా నున్నములోనికి యెముక లేకుండా తన్నుతారేమో. రుక్మిణి దొరికిందిగదాయను సంతోషములో మునిగి ప్రాణంతో సమానుడనైన చెలికానిని విడిచివేశావు. (ఎదుటజూచి) ఆరాజులందఱును కోలాహలము సేయుచున్నారు. నన్ను జావగొట్టుదురేమో. నేను పరుగెత్తుకొనిపోయి బలరామాదులను గలసికొందునుగాక?

(పరుగెత్తుచున్నాఁడు.)

శిశు—(జరాసంధాదులఁజూచి) ఆహా! రాజులారా! మనమందఱమును నేమఱుపాటున నుండగా, వంచించి యాదవుండు రుక్మిణిని రథముపై బెట్టుకొనిపోవుచున్నాడు. ఇందఱముండియు మాటాడక యూరకుంటిమి. ఇదియెవ్వరైనను విన్నచో బరిహసింతురు. మనకు బలధైర్యంబులు లేవా. శస్త్రాస్త్రములు లేవా. గాజులుదొడిగించుకొని యబలలవలె నుంటిమా. గొల్లడొకండు రాచకన్నియనుఁ గొనిపోవుచుండగా చూచి రాజులమైన మన మూరకుండుట వీరగుణమా? లెండు. లెండు. కన్యకను విడిపించకపోయినచో నగుబాట్లువచ్చును. (అందఱును నాయుధంబులతోఁ బరుగెత్తుచున్నారు.)

రంగము:—రథముపై శ్రీకృష్ణుఁడును—రుక్మిణియును
తారకుండు బ్రవేశింపుచున్నారు.

కృష్ణు—(రుక్మిణినిఁజూచి) ఇందువదనా! నీడెందంబునకిప్పు డానందంబుగలిగినదికదా.

రుక్మిణి—(సిగ్గుచేఁ దలవాల్చుకొనుచున్నది.)

కృష్ణు—రమణీ! పలుకవేమి!

తే॥ గీ। దృష్టిదోషంబు దగులునో ♦ తోయజాక్షి
పూర్ణచంద్రునిబోలు నీ ♦ మోముజూచి
సంతసింపగ నెంచ నీ ♦ సన్ముఖంబు
జూపకుండుటపాడియే ♦ శోభనాంగి.

తే॥ గీ॥ యిందుధరసుందరీ దివ్య ♦ మందిరంబు
వీడివచ్చినారాకకై ♦ వేచియుండి
నీదు క్రేగంటచూపులు ♦ నీరజాక్షి
బఱపియుండవె నాపైన ♦ బరమదయను.

అన్నులమిన్నా, నాయొద్ద నీకీలజ్జయేల !

తే॥ గీ॥ భవ్యభవదీయసౌందర్య ♦ వార్థిమునింగి
నీదుసందేశమాలించి ♦ నిక్కముగను
నేగుదెంచి భూధవ బృంద ♦ మెల్లజూచు
చుండదోడ్తెచ్చితినిఁగాదె ♦ శుభచరిత్రి.

రుక్మిణి—

చం॥ అగణితభాగ్యసంపదల ♦ కాకరమై; సనకాదిపుణ్య యో
గిగణహృదబ్జవాసమయి; ♦ కీర్తితమై; రమకాశ్రయంబునై
నిగమవిచారగమ్యమయి ♦ నీరజసంభవసన్నుతంబునై
యెగడు త్వదీయపాదయుగ ♦ మెప్పుడుగొల్వఁగ నెంతుమాధవా.

సీ॥ భావమెల్ల త్వదీయ ♦ పాదాబ్జములజేర్చి
నీసేవజేయంగ ♦ నిశ్చయించి
సత్వరమ్ముగనాదు ♦ సందేశమునుజెప్ప
మంచునునొక్క బ్రా ♦ హ్మణునిబంప

భవ్యసత్కృపఁబూని ♦ ప్రార్థనగైకొని
త్వరితగతినిమావి ♦ దర్భఁజొచ్చి
నిఖిలనృపాలకు ♦ లీక్షింపుచుండంగ
రథముపైనన్ను ని ♦ ర్భయముగాను
తే॥ గీ॥ బెట్టిదెచ్చితివి త్రిలోక ♦ వీరచరిత
యార్తరక్షణపారీణు ♦ డనెడిబిరుదు
దాల్చియుండుటనేఁడు స ♦ త్యంబుదోచె
బుణ్యగుణసాంద్ర యదుకులాం ♦ భోధిచంద్ర.

కృష్ణ—సుందరీ నీసౌందర్యవిశేషమే నిన్నుఁ గొనిపోవునట్లు గావించినది.

(తెరలో కలకలము.)

రుక్మిణి—(భయము నభినయించి) నాథా! ఏవియో! భయంకరార్భాటంబులు వినవచ్చుచున్నవి. గర్వాంధకారపరిమత్తహృదయులైన శిశుపాల జరాసంధాదులు వచ్చుచున్నట్లున్నారు.

కృష్ణ—రానిమ్ము.

రుక్మిణి—వచ్చిన కెట్లోగదా.

కృష్ణ—తరుణీ! నీవు భయంబందబనిలేదు.

మ॥ బలరామప్రముఖాదియాదవులు శం ♦ భల్లీలనేతెంచి; శ
త్రులసైన్యంబుల డాకివేగమె శర ♦ స్తోమంబులంగప్పి త
ద్బలమెల్లన్ హరియింతురీసంగరములో ♦ బాహుప్రతాపంబునన్
లలనా! భీతిని బొందనేల మది నా ♦ హ్లాదంబుతోనుండుమా.

యాదవవీరుల బలపరాక్రమంబులఁగూర్చి నీవిదివఱకెఱింగియున్నదానవు కావు. ఇప్పుడు నీకుఁ దెలియును.

(తెరలో)

ఉ. ఎంతకువచ్చెఁ గన్నెఁదన ♦ కీయఁగ లేదని యాదవుండు దు
ర్దాంతవిరోధ మీక్రియను ♦ దాలిచి దర్పముపేర్చి యాలయ

ప్రాంతమునందువేచి నర ♦ పాలురుజూచుచు నుండరుక్మిణీ
కాంతనుగొంచుబోయెనె జ ♦ గంబులు నిందయొనర్చునట్లుగన్.

సారథీ! రథంబుఁ ద్వరగా దోలుము. శ్రీకృష్ణుని రథంబును గలసికొని వాని దర్పంబార్చి రుక్మిణిని విడిపించెదఁగాక.

రుక్మిణి—మనోహరా! నాసోదరుండగు రుక్మికాబోలు వచ్చుచున్నాఁడు. నాశరీరము కంపమెత్తుచున్నది.

కృష్ణు—రమణీమణీ! అస్మదీయభుజబలపరిరక్షితవైయున్న నీకేమిభయము!

ఉ॥ ఆతఁడె కాదు ముజ్జగము ♦ లన్నియు నొక్కట నెత్తివచ్చినన్
భీతినొకింతయుఁ జెందను; వి ♦ భీతకురంగ విలోచనా! జగ
త్ఖ్యాతపరాక్రమంబునను ♦ నాహవభూమిని దర్పమేర్చి మ
చ్ఛాత శిలీముఖంబులను ♦ శాత్రవులన్ జముపీటికంపెదన్.

ఉ॥ చిచ్చఱకన్నునుం దెఱచి ♦ చేతఁద్రిశూలముదాల్చి రుద్రుఁడే
వచ్చునుగాక సాయమును ♦ వైరులకున్ బొనరింపనెంచి; య
స్మచ్చటులాస్త్రసంతతుల ♦ జంపి విరోధిశిరంబులెల్ల నీ
కచ్చనకాయలాడఁగ వి ♦ యచ్చరు లచ్చెరువందనిచ్చెదన్.

రుక్మిణి—(తనలో) ఇప్పుడు నాయగ్రజుం డీతనితో బోరాడుటకు వచ్చుచున్నాఁడు. ఇతఁడా నామనోహరుండు. ఆతఁడు నాసోదరుండు. ఇరువురిలో నెవ్వరికి హానిగల్గినను నాకేవిచారము. నిర్భాగ్యురాలనైన నామూలంబునఁగదా యిట్టిపోరాటంబు సంభవించుచున్నది. అసురవంశ మహాటవీదావానలుండగు నీమహానుభావుండు నాసోదరునియెడల నేమిహానికలుగఁజేయునోయని డెందంబున సందియంబుగలుగుచున్నది.

(రుక్మి ప్రవేశించుచున్నాఁడు)

రుక్మిణి—(భయము నభినయించుచున్నది.)

రుక్మి—(శ్రీకృష్ణుని ప్రక్కనున్న రుక్మిణినిఁజూచి)

చం॥ వలదనియెంతచెప్పినను ♦ భావమునందున సంశయింపకే
దుడుకుతనంబుదాలిచి యు ♦ దూద్వహుఁగైకొననెంచియీతడున్

బిలువఁగ సంతసించిపృథి ♦ వీవరులెల్లరు జూచుచుండ ని
శ్చలగతి వచ్చితే కులయ ♦ శంబును మన్ననగల్పరుక్మిణీ.

(కృష్ణునిఁజూచి)

మ॥ తలవంపుల్ ఘటియిల్లమాకును గడున్ ♦ దర్పంబునుంబూని యీ
కలికిన్ నాదగు సోదరీమణి నహో ♦ కార్యంబు చేదెచ్చితే
బలశౌర్యోన్నతులైన రాజవరులన్ ♦ వంచించి; నాముందటన్
బడినావింకను బోవగాఁదరమె గో ♦ పాలా! యశోదాసుతా.

ఓరీ! యాదవకులపాంసనా! సుక్షత్రియకులపాత్రవిఖ్యాతులమగు మే మేడ, పేదగొల్లఁడవగు నీవేడ!

తే॥ గీ॥ బలముశౌర్యంబుగల్గియుఁ ♦ బరిఘవిల్లు
ఝ్మాఘపుండైన సహియింపఁ ♦ గలనుగాని
పేదగొల్లవాఁడొక్కండు ♦ వెలదినిట్లు
గొంచు బోయెననిన నూర ♦ కుండఁగలనె.

కృష్ణ—ఓయీ! రుక్మి! అనవసరముగ ప్రేలకుము. నావాక్యములు ముందుగా నా లింపుము.

తే॥ గీ॥ కన్యహృదయంబు నాపైన ♦ నున్నదంచు
నేను పూర్తిగానెఱుఁగుదు ♦ నీచహృదయు
దాన దోడ్తెచ్చినాడను ♦ దరుణినిట్లు
కాలులేటికిఁ బ్రేలెదు ♦ గర్వమునను.

వివాహ నియమములందు రాక్షసవివాహముఁగూడ నొకటి నిర్ణయింపఁబడియే యున్నదికదా. ప్రతీయు నేనీకన్యకను తస్కరించి తేలేదు. శిశుపాలసాల్వజరాసంధాది సకల నృపాలురను జూచుచుండఁగనే తెచ్చితిని. సమర్థభుజబలములు నీ క్కపెట్టున నెత్తివచ్చినను నేను భీతిల్లువాఁడను గాను.

రుక్మి—అట్లనా!

తే॥ గీ॥ కన్నెదోడ్తెచ్చినావు త ♦ స్కరునిరీతి
నైనసైరించెదనునిన్ను ♦ నతివవిడిచి
ద్వారకాపురిదారిని ♦ దరలుమికను
కాకయుండినఁ జావుని ♦ క్కంబునీకు.

రుక్మిణి—(తనలో) వీరిరువురకును ఘోరసమరంబు జరుగునియే తోచుచున్నది.

కృష్ణ—

మ॥ వినరా నీతలదన్నినట్టి ఘనులౌ ♦ వీరప్రతాపుల్ మహా
రణరంగంబున మచ్చితాశువిష స ♦ ర్పజ్వాలలన్ దాఁకలే
క నమస్కారము లాచరించి చన లె ♦ క్కా నీవునాముందు; జం
కునె తాటాకులచప్పుడుల్ వినినచోఁ ♦ గుందేళ్ళు రాజాధమా.

ఓయీ! ఇంక ననుమానించెదవేల. రణవ్యాపారంబును బూనుము. నీనాబలంబులు దెలియవచ్చును.

రుక్మి—

శా॥ శ్రీలంగూర్చెడి వేణుగానరవముల్ ♦ జెల్వొప్పగావింపుచున్
గోలన్ జేతనుబూని మోదములరన్ ♦ గోపార్భకశ్రేణితో
నాలంగాఁచెడి భూమిగాదిది సము ♦ ద్యద్భీమసంగ్రామ స
త్కేళీరంగమటంచు నెంచుముమదిన్ ♦ గృష్ణార్భకా! డింభకా.

కృష్ణ—

శా॥ ఓరీ యేటికిఁ బ్రేలెదీకరణి న ♦ త్యుగ్రాహవక్రీడలో
నారాచంబుల నేకముల్ బఱపి భూ♦నాథుండు చింతింపఁగా
బారన్ జేయుదు నిన్ను నీదగుసఖుల్ ♦ భావంబునంగుందగా
రార్గా నుదియమేలనందెదవు శౌ ♦ ర్యంబున్ విలోకించెదన్.

మఱిదివని తలంచి యింతవరకును శాంతివహించి యుంటిని. ఇంక నీమొదల గరుణించు వాంఛను గాను.

రుక్మి—ఛీ! నీవు మఱదివగుదువని చెప్పుకొన్నచో మాకు సిగ్గగును. కృష్ణా! రణంబు నకు గడు తత్తరమందుచున్నాఁడవు. రణంబనగా నేమిగా దలంచితివి?

సీ॥ ఆరూఢమధుర వీ ♦ ణారవంబులుగావు
ప్రతిభటాభీల హుం ♦ కృతులుగాని
మైపూసికొనుటకై ♦ మంచిగంధముగాదు
రక్తసంయుతసంగ ♦ రంబుగాని
అదలించితోలంగ ♦ నాలమందలుగావు
భయముగొల్పెడువీర ♦ వరులుగాని
గోపికాయువతుల ♦ గుబ్బపోటులుగావు
వేడిజూపెడిబాణ ♦ వితతిగాని

తే॥ గీ॥ ముదముతోనుండ వ్రేపల్లె ♦ భూమిగాదు
నిఖిల శస్త్రాస్త్రములుగల్గు ♦ నేలగాని
యెడనీవేడ ననిసేయు ♦ టెడ; ద్వార
కాపురంబునుజేరి సౌ ♦ ఖ్యంబుగనుము.

కృష్ణు—ఓరీ! దుర్మదాంధా! కాలము సమీపించిన రోగి సంధిసొత్తి యీరీతి నే ప్రే లుచుండును.

మ॥ సమదాటోప పతంగపుంగవవిభా ♦ స్వద్దీర్ఘచంచూ సము
క్షమునందల్ప ఫణావిజృంభణ నట ♦ త్కాకోదరంబట్లు నీ
వు; మదోద్రేకుఁడవై; ననుఁ గవయఁగా ♦ బూర్ణప్రతాపంబుతోఁ
గుమతీ! వచ్చితివే; నినుఁ దునిమెదఁ ♦ ఘోషింపనీబాంధవుల్.

మ॥ ననునీవెవ్వనిగాదలంచితివో నా ♦ నాదైత్యవంశాటవీ
ఘనదావానలమూర్తి నంచెఱుఁగవో ♦ కష్టాత్మసంయుక్త దు
ర్జనబృందంబునుగూల్చి యీపుడమి భా ♦ రంబెల్లబాపంగ; నే
జననంబందినవాఁడనంచరయుమీ ♦ యుష్మత్సాల వంశాధమా,

రుక్మిణి—(తనలో) నాథుండంతకంతకు రౌద్రాకృతిఁ దాల్చుచున్నాఁడు.

రుక్మి—(కృష్ణునిఁజూచి) కృష్ణా! మాటలతో బ్రయోజన మేమియున్నది. ఇంచుక నిల్చిపోరాడినచో నాశౌర్యంబు నీకుఁ దెలియఁగలదు.

కృష్ణు—ఇదిగో! సంసిద్ధుఁడనై యున్నాఁడ.

రుక్మి—ఈశరంబును గాచుకొనుము. (కృష్ణునిపై శరము బ్రయోగించుచున్నాఁడు.)

కృష్ణు—ఇదిగో! నీశరంబును ఖండించినాను.

రుక్మి—వాసుదేవా! నాముందుఁబడి నీవెందుబోఁగలవు.

మ॥ యదువంశోత్తమ పాఱిపోవక సము ◆ ద్యద్ధైర్యముం బూని యీ
కదనక్షోణిని నిల్వు; నీదుశిరముం ◆ ఖండించెదన్ నేఁడు మా
గధచైద్యాదులు సంతసింపఁగను లో ◆ కఖ్యాతిసంగాంతు నా
త్రిదశుల్ గూడ భయంబుఁజెందఁగ జయ ◆ శ్రీగాంచెదన్ మించెదన్.

కృష్ణు—ఓయీ! శూరుండైనవాఁ డెన్నఁడును నిట్లు స్వస్తుతిఁ జేసికొనఁడు. నీబల పరాక్రమంబు లెవ్వరికిఁ దెలియవు.

తే॥ గీ॥ మంచిచెడ్డలింతయు విచా ◆ రించకుండ
ద్రవ్యమునకాసజెంది సో ◆ దరినిఁ జేది
పతికినర్పింపనెంచిన ◆ పాపరతుఁడ
వీవు నినుజూడగారాదు ◆ హీనచరిత.

రుక్మి—ఆఁ యేమనిరా ప్రేలితివి. (శరప్రయోగము జేయుచున్నాఁడు.)

కృష్ణు—(శరంబును ఖండించి. చక్రము చేతబూని) ఓరీ! నీచాత్మా। నీకాలము సమీపించినది. ఇదుగో చూచుకొనుము. దైత్యసందోహకఠినకంఠలుంఠనగళ శ్రోణితారుణితసహస్రకర సహస్రకోటి మార్తాండప్రభాభాసమానభయంకరంబును, శాత్రవయువతీగర్భనిర్భేదకంబును, సమస్తామర మునిజనసేవ్యంబును, నక్షీణకటాక్ష వీక్షితసమస్తగీర్వాణరక్షణ దీక్షాబద్ధకంకణాలంకృతంబును, సుదర్శనాభిధానవిరాజితంబును నగు నస్మచ్చక్రమిదే విడుచుచున్నాఁడ. (చక్రము బ్రయోగింపబోవఁగా రుక్మిణి శ్రీకృష్ణుని హస్తముఁబట్టుకొని)

రుక్మిణి—

తే॥ గీ॥ నీమహాత్మ్యంబుగనలేక ♦ నిజముఁగాఁగ
నిందయొనరించె నిన్ననుఁ ♦ నీరజాక్ష
పాపమునుగాచి రక్షింప ♦ వలెనుగాక
చంపనెంతువె మఱచిని ♦ సాహసమున.

తే॥ గీ॥ భవ్యభవదీయదర్శన ♦ భాగ్యమునను
జనులుచేసెడిపాపంబు ♦ సమసిపోవు
కమలమిత్రోదయంబును ♦ గాంచినంత
యంధకారమంతయు మాయ ♦ మైనవగిది.

దేవా! పురాణపురుషా! నీవు భక్తరక్షణదీక్షాబద్ధకంకణుండవు. నాయెడ గృపాంతరంగుండవై నాయగ్రజుని రక్షించి నాకోరికఁ దీర్పుము.

కృష్ణు—తరుణీ! ఇతఁడు మహాపాతకవర్తి. వీనిని బ్రతుకనీయరాదు.

రుక్మిణి—దేవా! ఆర్తనై చెప్పుచున్న నావిన్నప మాలకింపుము.

శా॥ దూరాన్వేషణ మాచరింపకనినుఁ ♦ దూషించియిప్పట్లమీ
ర్వారాఘంబును గాంచియుండియును సం ♦ గ్రామస్థలంబందున
న్ఘోరాస్త్రంబుల బాలుఁజెందికడు ఖి ♦ న్నుండయ్యెనాయన్న; నీ
కారుణ్యంబునఁ బ్రోవఁగావలయు లో ♦ కానందసంధాయకా.

ప్రాణేశ్వరా ఇంక నొకప్రార్థనఁ జిత్తగింపుము. మాధవుం డల్లుడయ్యెను గదా యని మాతల్లిదండ్రులు సంతసింపుచుందురు. అట్టిచో నీవితనిని వధించితివేని వారిశోకంబునకు మితిలేకయుండును.

కృష్ణు—(తనలో) ఆహా! ఎట్టికఠినహృదయంబయినను కాంతల వాక్యములచే గఱగిపోవును. ఇప్పుడు నే నీతని వధించితి నేని యీమె హృదయంబున జింత బ్రవేశపెట్టినవాడనగుదును. కావున వీనికిఁ దగిన పరాభవం బాచరించి పంపెదనుగాక. (రుక్మినిఁజూచి) బావా! అగ్రహంబుడిగి యిటురమ్ము. (రుక్మిని బట్టుకొని) మఱదీ! నీవు నాయెడలజేసిన యపరాధంబున కీశిక్ష విధింపుచున్నాను.) (మూతియు మీసంబును దలయును గ్గొఱుగును.)

రుక్మి—(తనలో) ఇంతకంటె జంపినను బాగుండునుకదా, అగ్నికన్నను వేడియైన ఖడ్గముయొక్క వాడికన్నను నెక్కుడై యవమానంబు చిత్తంబును దహింపఁజేయుచున్నదిగదా. ఇప్పుడీతనిని నేనేమియుఁ జేయఁజాలను. ఎప్పటికైనను నీతనిని నిర్జించితీరవలయును.

రుక్మిణి— (తనలో) అహా! మాయన్న మరణముకన్న నెక్కుడయగు పరాభవమందినాఁడు.

[బలరాముఁడు—సునందుఁడు ప్రవేశించును]

బల—(తనలో) నాతమ్ముఁడీరుక్మిని మిగుల పరాభవించినాఁడు. (కృష్ణునిఁజూచి) కృష్ణా! నీహృదయంబు నెవ్వఁడును గనుగొనఁజాలఁడు. కాని బంధువునిమూర్తియుఁ దలఁపక గొఱుగుట చంపుటవంటిదేకదా. లోకంబున శత్రువులను వారు నీకు లేరు. అందఱియందును నీవు సమబుద్ధింబూని వర్తింపుచుందువు. అట్టిచో నీవఁడిదియెడల నిట్టి విషమబుద్ధి నేలఁబూనితివో తెలియకున్నది. (రుక్మిణినిఁజూచి)

తే॥ గీ॥ అమ్మ యొక్కింతశోకించ ♦ కమ్మ రుక్మి
కైన యీపరాభవమును ♦ నాత్మఁ దలఁచి
పూర్వకృతపాపమెవ్వాఁడు ♦ బోవఁజేయు
శక్తుఁడయ్యెడుచూడుమీ ♦ జలరుహాక్షి.

రుక్మిణీ! నీయగ్రజుండు నేఁడు పూర్వజన్మకృతదోషంబులఁబాసి పవిత్రుఁడైనాఁడు. (రుక్మినిఁజూచి) బావా! రుక్మి! గతించినదానికిఁ జింతింపకుము.

సునం—(తనలో) ఆహా! జలదాంతమున భాసిల్లు చంద్రికరీతి మాకృష్ణునిప్రక్క రుక్మిణి శోభిల్లుచున్నది.

కృష్ణ—(సునందునిఁజూచి) మిత్రమా! సచ్చరిత్రా! తొందరసమయమున నిన్నుఁ జూడకనేపోయితిని.

సునం—నువ్వెందుకు మాస్తావు. సరేలే. నేనున్నూ బలరామాదులకు తోడుపడి శిశుపాలజరాసంధ సాల్వాదిరాజులను సురాడాములెత్తించినాను. ఏమనుకొన్నా వేమిటి.

రుక్మిణి—(తనలో) ఈతఁడు మనోహరునకు వేడుకచెలికాఁడుకాఁబోలు.

(తెరలో మంగళధ్వని.)

కృష్ణ—(బలరామునిఁజూచి) అగ్రజా! ఏదియోధ్వని వినవచ్చుచున్నది. ఏమై యుండును.

బల—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) తమ్ముఁడా! భీష్మకుండు నీసన్నిధి కరుదెంచుచున్నాఁడు.

రుక్మి—(తనలో) ఇప్పుడు నాతండ్రిమొగంబు నే నెట్లు చూడఁగలను.

[భీష్మకుఁడు ప్రవేశించును.]

భీష్మ—(తనలో) భగవత్కృతంబు నెవ్వఁడును దప్పింపలేఁడుగదా. ఆహా! నాజన్మ ధన్యమైనది. కుమారీమణిని రథముపైఁ బెట్టుకొని యరుగుచున్న వాసుదేవుని కడ్డుపడి నాతనయుఁడు పరాభవమందినాఁడు. (కృష్ణునిఁ సమీపించి)

ఉ॥ ధన్యుఁడనైతి నింకఁ బరి ♦ తాపముదీఱెను నాదువంశమున్
మాన్యతకెక్కె సిద్ధమయి ♦ మానసులునైనను గాంచలేని స
న్మాన్యచరిత్రు నిన్నును ర ♦ మాధవుభర్తఁగ గాంచగల్గె మా
కన్యక; రుక్మిణీరమణి ♦ కంజదళేక్షణ భక్తరక్షణా.

కృష్ణ—నృపాలచంద్రా! మహాసాహసంబాచరించితిని నన్ను మీరు మన్నింపవలెను.

భీష్మ—కృష్ణా! నీవు భగవంతుఁడవు. నిన్ను గాదనువారెవ్వరు. (రుక్మిణినిఁ జూచి) అమ్మాయీ! రుక్మిణీ! బాల్యంబునుండియు నీవెవ్వనిఁగోరియుంటివో యా మాధవుండే నీకు పతియయ్యెను. నీభాగ్యంబును వర్ణించుట కెవ్వరితరము! అమ్మా! లక్ష్మీకళత్రుండు నాకల్లుండయ్యెనను సంతోషంబునకు మేరలేకున్నది.

కృష్ణ—రాజేంద్రా! నీమనోభీష్టంబు నెఱవేఱినది. ఇంక నేమికావలయును.

భీష్మ—కృష్ణా! మాకేమికావలయును. అయినను నిట్లనుగ్రహింపుము.

మ॥ అతసీపుష్ప సమప్రకాశ, పరిపూ ♦ ర్ణానందసందోహ సం
తతలక్ష్మీహృదయానివాస జలజా ♦ త ప్రోద్భవాధీశ యా
శ్రితపాపౌఘవినాశ భద్రయశ దా ♦ క్షిణ్యాత్మ; సర్వేశ మా
మతియందెప్పుడు బాయకుండు గుణధా ♦ మా! దేవకీనందనా.

సుర—తథాస్తు! తథాస్తు!

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.